కవితాసమితి గ్రంథావళి · ౬

# తెనుఁగు-తోఁబుట్టువులు

మారేపల్లి రామచంద్రశాస్త్రి
కవితాసమితి అధ్యక్షుఁడు

కవితాసమితి · విశాఖపట్టణము

ఎనిమిది అణాలు

# కృతజ్ఞత



'తెనుఁగు - శోభాస్తవములు' మొదట మా వైశాఖిలో ప్రకటితమై, పలువుర మన్ననలకు పాత్రమైనది. పత్రికలన్నియు ముక్తకంఠముతో దీనిని ప్రశంసించినవి, గ్రంథరూపమున వెలువరించుటకు ప్రోత్సహించినవి.

దీనిని గ్రంథముగా ముద్రించి ఈయవలెనని శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుగారి నర్థించితిమి. వారు వల్లెయని మా రామచంద్రశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవమున కానుకగా ఈయ నంగీకరించిరి. వారికి కృతజ్ఞులమై, వందనసహస్రము లర్పించుచున్నాము.

కవితాసమితి
విశాఖపట్టణము
౧౯౩౫-నవంబరు

పురిపండా అప్పలస్వామి
కార్యదర్శి

మేల్!

# ముందు ముక్కలు

తల్లిపలుకుపై మన్నన ఎల్లరకును ఉండు నందురు. దానికి తగినటుల బంగాళీలకు బంగాళీయందును, హిందీవారికి హిందీయందును, ఉర్దువారికి ఉర్దూయందును, మరాటీవారికి మరాటీయందును, గుజరాతీవారికి గుజరాతియందును, ఒడియావారికి ఒడియాయందును, తమిళ కన్నడులకు తమిళ కన్నడములందును, ఇంగ్లీషు-ఫ్రెంచి-జెర్మను-రష్యను-ఇటాలియను-జపానీసు మొదలగువారికి తమతమ పలుకులందును మన్నన కలదు. కాని, అట్టి మన్నన మన తెనుఁగువారికి పెక్కురకు తెనుఁగునందు సున్న! ఇది తెనుఁగుతల్లి నోఁచుకొన్న కొఱనోముపంట !!

అయిన, దీనికి కతమేమి? అందురా? కతమా ? ఒకటి కాదు; పెక్కులు కలవు కతములు: ౧. తెనుఁగునాట మొదటి నుండియు ఉన్నవారికి పలువురకు చదువు లేకపోవుట; ౨ చదువుకొన్నవారికి సంస్కృతముమీఁదను, ఇంగ్లీషుమీఁదను ఉన్న మోజు తెనుఁగుమీఁద లేకపోవుట; 3. చదువుకొని, తెనుఁగుపొత్తములు వ్రాసినవారును, వ్రాయుచున్న వారును

పలువురు సంస్కృతమో, ఇంగ్లీషో చదువుకొని వానియందే వెఱ్ఱిమన్నన కలిగి, తెనుఁగునందు ఉండవలసిన మన్ననకూడ ఉదాసీనులయి ఉండుట; ౪. వారికి తెనుఁగు పుట్టుగట్టు లరసి తెనుఁగుతనము పెంచుతలంపు లేకపోవుట, ౫. అందుచే వారు వాడుకలో ఉన్న వాటి నుడులు తెలిసికొని వాడుటకు మాఱు, అక్కఱమాలిన సంస్కృతపునుడులును, ప్రాకృతపు నుడులును, తక్కిన నుడులును - ఇపుడు ఇంగ్లీషు నుడులు, కొందఱు ఇంగ్లీషు వ్రాఁతలో కూడ వాడుచు - తెనుఁగు పొత్తము లలో తెనుఁగునుడులకును, మొత్తముమీఁద తెనుఁగుతనము నకును ఇయ్యవలసిన పెద్దఱికము ఇయ్యకపోవుట; ౬. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు సైతము తెనుఁగుతల్లిని తగిన తెఱంగున మన్నింపక చిన్నచూపుతో చూచుట మొదలగునవి. ఇట్లు మన తెనుఁగువారికి తెనుఁగుపై మన్నన సన్నగిల్లినది; సన్న గిల్లుచున్నది.

కాని, ఈకొఱంత ఈ నడుమ మనవారు కొందఱు మరల గుర్తించి, తెనుఁగుతల్లిపై మన్ననచూపుచు, తెనుఁగు తనము పెంపకడంగుచుండుట కొంత మేలుఁగు. వాడుక పలుకే అంతటను వాడవలెననువారు కొందఱు బయలుదేఱి నారు. వారు అందఱును ఆకట్టుఁబాటు సరిగా పాటించుచో ఎంతో బాగుగా ఉండును. కాని అట్లు జరుగుటలేదు. వాడు కలో లేని ఎన్ని సంస్కృతపదములో - పదములే కాదు, పెద్ద

పెద్ద సంస్కృతసమాసములుకూడ-పెక్కురు వాడుచున్నారు. ఇప్పటినుండిఅయినను వారు తమకట్టుబాటు సరిగా పాటించి, తెనుఁగుతనము నిలుపఁ గడంగుట మేలు. అందు ఎచ్చటివారు అచ్చటి వాడుకపలుకే వాడుట మఱియు మేలు.

పెఱవారు పెక్కురు తెనుఁగుపాడి తాము చేయుట లేదనియు, చేయువారును సరిగా చేయుటలేదనియు తెలుపు వారు తమపాడి తాము తప్పక చేయవలె. నీ వేమి చేసితివి? అని నన్ను ఎవరేని అడుగవచ్చును, అడుగఁగును. మనవి చేసెద, వినుఁడు: ఉన్న తెనుఁగునిఘంటువ్యాకరణములు కూడ తిన్ననిదారి పట్టవేదని గట్టిగా పట్టినవెంటనే, అవి తెనుఁగుతనము సరిగా తేటపఱచు తెఱంగున వ్రాయవలయు నని ౧౯౧౮ నుండియు వానిగూర్చి పనిచేయఁదొడంగి, కొంత పని చేసితిని. అంతలో అట్టికెంపుశోధనే ఆంధ్ర సాహిత్యపరిషత్తు ఏర్పడెనని తెలియరాఁగా, దానివలన తెనుఁగులోటులు తీఱునని ఎంతో అలరితిని, నా కడంకతో పనిలేదనుకొంటిని; అందుచే ఆ పనిబిగి తగ్గించి. నాటికొలువు తక్కిన తెఱంగుల హెచ్చుగా చేయుచుంటిని. కాని, ౧౯౨౮ లో వెలువడిన సూర్యరాయాంధ్రనిఘంటువు మచ్చునుడుల పీఠికలో అందలిపదములు సంస్కృతసమములు, తదితర ములు-అని రెండుచందములుగానే ఉంచునట్లును, ప్రాకృత సమాదిభేదములు తెలుపుటకు సాధనసామగ్రి చాలమిచే

ఆప్రయత్నము మానినట్లును కనఁబడుటచే, ఆప్రయత్నము కవితాసమితిపక్షమున చేయునటుల నేను పత్రికలలో వెల్లడించి, దానినిబట్టి పనిచేయుటకు మరల మొదలుపెట్టితిని. కవితాసమితి విభవవార్షికసంచికలో, మొదట తెనుఁగు కొఅంతలును - చేయవలయు పనియు తెలుపఁదగు ననుకొని, 'తెనుఁగు - పరిపూర్ణపాండిత్యము' - అను వ్యాసము వ్రాసితిని. (౧౯౩౭ లో వైశాఖియందు —— ఆంగీరసవార్షిక సంచికయందు - తెనుఁగు ద్రావిడభాషాకుటుంబములోనిది కాని, ఆర్యభాషాకుటుంబములోనిది కాదని తెలుపుటకు 'తెనుఁగు - తోఁబుట్టువులు' అను ఈవ్యాసము వెల్లడించితిని. ఇది దేశాదుల యెల్లగీఁతలపటమువలె చూచాయగా తెనుఁగునుగూర్చి తెలుపునదే కాని గుట్టుమట్టులెల్ల తెలుపుటకు వ్రాసినది కాదు. అయినను దీనినిగూర్చి భారతిలో విమర్శించి, తెనుఁగుపై మన్ననకలవారు —— మనవి మాటలు వ్రాయువారు — ఇది బాగుగా ఉన్నదనియు, పెంచివ్రాయవలయు ననియు తెలిపియున్నారు. ౧౯౩౩ మే నెలనుండి, అప్పటికి ౪౦ ఏండ్లనుండి చేయుచుండిన నాటి కొలువు వెనుకఁబెట్టి, తెనుఁగుతల్లికొలువే చేయ నిరుకు చేసికొని, ఆమెకై సేఁతకొఅకే పాటుపడుచున్నాను. ఇప్పటికి దీనివలెనే 'తెనుఁగు - తోడులు' అను వ్రాయిక వ్రాయుటకు వలయుసజ్జు సమకూర్చుకొనినాఁడను. నేను చేసినది ఇది.

‘ తెనుఁగు - తోఁడులు ’ వ్రాసి వెలువఱిచిన వెనుక, తెనుఁగు - తోఁబుట్టువులును, తెనుఁగు-తోఁడులయు కిటుకులు వీఁగునంతవఱకు అరసి, ‘ తెనుఁగుపుట్టుపెంపులు ’ — తెనుఁగుంలుకుతీర్పు — వ్రాయవలె ననియు, దాని తోడనే ‘ తెనుఁగునుడికట్టలి’ — వీఁగునంతవఱకు పుట్టుగుట్టుల తోడి తెనుఁగునుడిదండ — వ్రాయవలెననియు తలంచుచు, వానికి వలయు అంగు చేకూర్చుకొనుచున్నాఁడను.

ఇట్టుండ, మాకవితాసమితి కార్యదర్శి, శ్రీయుత పురిపండా అప్పలస్వామిగారు హెచ్చరింప, దానిస్థాయిసంఘసభ్యులలో ఒకరగు శ్రీయుత గొన్నేటి విశ్వనాథముగారు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని నా ‘షష్టిపూర్తి మహోత్సవము’నకు అధ్యక్షులుగా ఉండవలెనని కోరుచు, నా ‘తెనుఁగు-తోఁబుట్టువులు’ అచ్చొత్తింపవలెననియు కోరిరఁట! ఆవిశ్వదాత అందులకు అంగీకరించెనఁట! అందుమీఁద అప్పలస్వామిగారు అది నాకు తెలిపి, ఇది ఒకసారి చూచి ఇయ్యవలెనని కోరిరి. ఇందు చేర్పవలయునది ఉన్నను, ఓపిలులేమిచే ఏదో కొంతయే చేర్చి ఇచ్చితిని.

ఇటలీలోని ఎట్రస్కనుభాషకు త్రైకాపలుకుతో — ద్రావిడభాషతో — పెక్కు చక్కనిపోలికలు కలవని సైక్ కోనోపండితుఁడును, అట్టి పోలికలు బంగాళిలోను కలవని విజయచంద్రమజుందారుపండితుఁడును తెలుపుచున్నారు.

తెలుగుపలుకే మొదట బంగాళములో వాడియుండిన జాడలు కలవని సునీతికుమార చటర్జీ పండితుఁడు చూపియున్నాఁడు. పైబంగాళీపండితులు ఇరువురును ఇప్పటి ఒరిస్సాలో క్రీ. పె. ౭ వ శతాబ్దివఱకును తెలుగుపలుకే వాడుకలోనున్నట్లు చాటుచున్నారు. ఇంతేకాదు. ఫట్జర్ పండితుఁడు యూరపు ఖండములో ఒంటరిగా ఉన్న బాస్కు బాసకు అచ్చటి భాషలతో పొత్తు లేదనియు, అమెరికాతొలి కాఁపుల పలుకులతోనే పొత్తుకలదనియు చెప్పుచున్నాఁడు. బీ. డేవిస్ పండితుఁడు బాస్కులును, కేనరీద్వీపులలోని గుఆంచీలును ఒక తెగకే చెందినవారని తలంచుచున్నాఁడు. హ్యామీ-క్వాట్రెఫేజెస్ పండితులు ఇద్దఱును, దక్షిణఫ్రాన్సులోని క్రోమాఁగ్నాఁ వారును-గుఆంచీలును ఒకే తెగవారని నుడువుచున్నారు. ఇఁక, బ్లావట్స్కీ-అమ్మ-బాస్కులబాసకును, ఇండియాలోని ద్రావిడుల భాషకును కానవచ్చు గుట్టుపొత్తు, 'మేము తెలిపినఖండముల యేర్పాటును, వానిమార్పును గుర్తించినవారే తెలిసికొనఁగల'రని తెలుపుచున్నది.

అయిన, పైనెఱవాదుల వ్రాఁతలవలన తేలిన దేమి? తొలితెలుగుపలుకు — తొలివేల్పుల పలుకు — యూరపు ఖండములోనే కాక అమెరికా ఖండములో కూడ తొలిభాషగా ఉండిన దనుటయే. అపుడు ఆసియా ఖండములో మాత్రము మఱొకపలుకు కలదా?

అట్టిదో తొలితెనుఁగుపలుకే భరతఖండపు తొలిభాష అగుటలో వింత ఏమున్నది? ఇంతకు కొలికిమాట ఇది: తొలి తెనుఁగు పలుకే — తొలి ద్రావిడభాషయే — రాక్షసీభాష. రాక్షసులు ఎవరు? దాసులు, దస్యులు, ద్రావిడులు; వీరే తొలి వేల్పులు. తొలివేల్పులు వేల్పులకంటె ముందటివారని వేఱే చెప్ప నక్కఱ లేదుకదా! వేల్పులు ఎవరు? ఆర్యులే. ఇట్టియెడ ద్రావిడులభాష తొలిపలుకు కాక, ఆర్యులభాష కాని, ఇరానియనులభాష కాని తొలిపలుకు అగుట ఎట్లు? నిజమునకు ఇప్పటి నిక్కపు ద్రావిడుల తొంటిపెద్దల — దైత్యదానవుల — పలుకు ఒక్కటియే మొట్టమొదట నేలమీఁద అంతటను వాడుకలో ఉండె. తరువాత ఎప్పటికో — మొన్న మొన్న — వచ్చినది సంస్కృతము. అయినను, "తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును" అనుమాట ఇంకను మనవారు పెక్కురు సిద్ధాంతముగానే ఎంచుచున్నారు! నేల నాలుగుచెఱఁగులను ఇపుడు ౯౦౦ పలుకులు కలవని తెలియవచ్చుచున్నది అవి అరసి, పలుకునేర్పరులు పెక్కు వంగడములుగా అమర్చినారు. కాన సంస్కృతమే ఎల్లపలుకులకును తల్లి అనుకొనుట పొరపాటు; అది ఇప్పుడైన దిద్దుకొనవలదా?

'తెనుఁగు - తోఁబుట్టువులు' ఇటుల ఇపుడు విడి పొత్తపు రూపున అచ్చుపడునని నేను రవంతయు తలంప

లేదు. ఇట్టిదే దైవబలము! అది అప్పలస్వామి-విశ్వనాథము-నాగేశ్వరరావు పంతులుగార్లచే ఈపని చేయించినది. నా మేలుమఱవమిని తెలుపుచు, వారికి ఎల్లనాఁడు ఎల్లశ్రేయమును ఎల్లతెలుఁగులను మేలు కలిగించుఁగాక అని కోరుచుండెద. తెనుఁగుతల్లిని మన్నించుచు, ఆమెను కొలుచుచుండు నా తోఁబుట్టువులను అందఱను నాకు తోడ్పడ వేఁడెద

యువ కార్తిక బ. ౩ బు.,
ది ౧౩-౧౧-౧౯౩౫,
విశాఖపట్టణము.

మారేపల్లి రామచంద్రశాస్త్రి



# తెనుఁగు - తోఁబుట్టువులు

భాష.

అంతటను దేవుఁడు కలఁడని తెలిసినపిమ్మట ఎందేని ఉసురు లేదను టెట్లు? అయినను, ఉసురుబలిమి అన్నిమొదలను ఒక్కకొలఁదినే ఉండి, ఒక్కతెఱఁగుననే పనిచేయదు. దానికతము ఉసురునునికిపట్టుల వేర్పాటే. ఎట్లు అందురా? కనుఁడు. ఒక్క క్రొవ్వువత్తిదివ్వె వెలుఁగు మిక్కిలి తక్కువ. పదివత్తులబలిమిదివ్వెది దానికంటె ఎక్కువ. ఇరువదివత్తులబలిమిదివ్వెదియు, నలువదివత్తుల బలిమిదివ్వెదియు, నూఱువత్తులబలిమి దివ్వెదియు వరుసగా తన తన వెనుకటిదాని వెలుఁగుకంటె ఎక్కువ. మఱియు, మానిసిబలిమిచే అగుపని మిక్కిలి తక్కువ. పదిగుఱ్ఱాల బలిమిమరంది దానికంటె ఎక్కువ. ఇరువది - ముప్పది - నలువది - ఏఁబది - నూఱు చొప్పున గుఱ్ఱములబలిమి హెచ్చిన కొలఁదిని, తరువాతిదానిపని వెనుకటిదానిపనికంటె హెచ్చుచుండును. ఇటులే మట్టిగడ్డ, రాయి, చెట్టు, నీటిపుట్టువు, పిట్ట, పసి, మానిసి — అను స్థావరజంగమములలో ఒక్కొక దానియందు ఉసురుబలిమి వరుసగా హెచ్చును. కాన

దానిచే అగుపనులును ఒకదాని నొకటి మించియుండును. ఉసుఱుబలిమి మేనిబలిమి — తెలివిబలిమి — అని ౨ తెఱంగులు. వీనిలో మానిసికి రెండవది హెచ్చు. ఆ తెలివిబలిమి చేతనే మానిసి అన్నిటికంటె మిన్న కాఁజాలె. ఒకటే రకపు మేనులలోని బలిమియు వాని స్థితిభేదమును బట్టి భేదించుచుండును.

ఉసుఱుబలిమివలన పెక్కుపనులు జరుగుచుండును. అందు మనుజుల తలఁపులు, మెచ్చునగవులు మొగలగునవి తెలుపుట ఒక పని. ఈ పనియే — మనుష్యులు తమతలంపులు మొదలగునవి ఒండొరులకు తెలుపుటకు ప్రయత్నించి నోటితో చేయు పనియే — భాష.

కాని ప్రత్యేకముగనో, ముఖ్యముగనో తలంపులు మొదలగునవి తెలుపు మనస్సుపని ఒకటియేభాష కానేరదు. ఆజ్ఞలు, కోరికలు, ప్రార్థనలు, శాపములు మొదలగు బుద్ధిపనీ కూడ చేర్చినను - ఆనిర్వచనము సరిగా తగినది కాఁజాలదు; భాష తఱుచుగా గాఢము లగు మనోవికారములు పైకి వెడలించు సాధనముగా ఉండును, కాని మిక్కిలి తఱుచుగా ఏమియు తెలుపు తలంపు లేకయే వట్టివేడుక తీర్చుకొనుటకే వినియోగించును. ఇట్టియెడల జరుగు వాగవయవముల సంతోషకరమగు పరిశ్రమము భాష పెంపొందుటకు కడుంగడు తోడ్పడినది. ఇంతేకాదు. మనుజు లొండొరులను కలసికొను

నపుడు తలఁపులు తెలుపుటకుఁ గాక, స్నేహమునో గౌరవ మునో తెలుపుటకును భాష అక్కఱకు వచ్చును. ఇందులకు 'నమస్కారము', 'దండాలు' మొదలగు నుడులు చూపుట అందఱకును తెలిసిన దే.

చిన్న సంఘములనో, పెద్దసంఘములనో ఒకటిగా కూర్చు మిక్కిలి ముఖ్యములగు శక్తులలో భాష ఒకటి. కొన్ని భాషలు కొలఁదిపాటిపట్టున తక్కువమంది చే మాట లాడుదురు. దగ్గఱలో ఉన్నవారును ఒండొరుల భాషలు తెలిసికొనఁజాలకుందురు. కొన్ని భాషలు పెన్ప్రదేశమున పెచ్చుమంది మాటలాడుదురు. కొన్ని వట్టి మోటుభాషలు కొన్ని మిక్కిలి కృషి జరిగినవి. తోడభాష మాటలాడువార నీలగిరులలో కొంచెపట్టున కొన్ని వందలమంది మాత్రమే ఉన్నారు. ఇఁక ఇంగ్లీషు మాటలాడువా రన్ననో సుమారు ౩౦ కోట్లమంది అయిదుఖండములలోను వ్యాపించియున్నారు. ఇంతవ్యాప్తి మఱియేభాషకును కానరాదు. భాష ఒకటిగా ఉండుట ఆధ్యాత్మికజీవితమున మిక్కిలి ముఖ్యభాగము కావునను, దానివలన స్నేహమును, స్థిరత్వమును పెచ్చును కావునను, భావల హద్దులు సర్వదా రాజకీయపుహద్దులతో సమముగా ఉండవు కావునను, భాషాసమస్యలు జాతీయస్పర్థ లలో ప్రాముఖ్యము వహించుట మిక్కిలి సహజము. కాని 'జాతి'యు, 'భాష'యు సమానవ్యాప్తి కలవి కావు;

ఏమన, జాతీయైకమత్యమునకు ముఖ్యాధారము భాష కాక, చరిత్రతో సంబంధించిన విషయములవలని సాంఘికదృష్టి అగుటయే. ఒకదానికిని, భాషకును సంబంధమే లేకపో వచ్చును. ఇందుచేతనే స్విస్సువారు నాలుగు ప్రత్యేకభాషలు మాటలాడుచున్నను, ఒక్కజాతివారుగానే తాము నడచు కొనుచున్నారు. పెక్కుభాషలు మాటలాడు భారతీయుల జాతీయతయు ఇట్లు స్థిరపడినదే. ఇంక, పెద్దబ్రిటను-అమెరికా సంయుక్తరాష్ట్రములవారు మొత్తముమీఁద సమానమగు ఒకేభాష మాటలాడుచున్నను, రెండుజాతులుగా చీలి యున్నారు.

మిక్కిలి విరివిఅగు అర్థమున, ప్రాణులు తలంపులను తెలుపుటకు వాడు ఏసాధనమైనను భాషగనే కావచ్చును. పెక్కు పెద్దజంతువులు మనుష్యుల మాటలకు కొంచెము దగ్గఱగా వచ్చు పలుసాధనములచే తమతలంపులును, మనో వికారములును తెలుపుకొనుచున్నను, చిన్నజంతువులకు మనుష్యభాషతో సరిగా పోల్పఁదగినది ఏదికాని కలదని వక్కాణింప వీలులేమిచే - పెంపొందినరూపున భాష నిక్క ముగా మానవలక్షణ మనియే కాక, అది వారికిని తక్కిన జంతువులకును చూపట్టు భేదమును తెలుపు ముఖ్యలక్షణ మని కూడ నుడువవచ్చును. అందుచేతనేకదా తిర్యగ్జంతు వులు నోరులేని వగుట! కాన నోరున్నజంతు వన్న ఒక్క

మానిసియే - అనఁగా భాష మనుష్యునితో సంబంధించినదే. తొలుదొలుత సైతము భాషలేని మానవజాతి కానరాదు. అంతే కాదు. ఎంత వెనుకఁబడియున్న తెగయేని భాషలేనిది లేదు. చరిత్రకాలమునకు పూర్వ మున్న మిక్కిలి తొల్లింటి మానిసిపుఱ్ఱెల రూపునుబట్టి, అప్పటివారికి మాటలాడుశక్తి ఉండఁజాలదని కొందఱు చూప యత్నించిరి. కాని, దానికి సంపూర్ణములగు ఆధారములును లేవు, తగినపునాది యును లేదు.

(కావున, తలఁపులు తెలుపుటకే కాక - మనోవికారములను తెలుపుట కేమి, బుద్ధికార్యములను వెల్లడించుట కేమి, వేడుకలు తీర్చుకొనుట కేమి, స్నేహగౌరవాదులను కనఁబఱచుట కేమి, కొంతవఱకు జాతీయైకమత్యమును నెలకొల్పుట కేమి, మంచిచెడ్డలను బోధించుట కేమి, నాగరకతను సమకూర్చుట కేమి, తుదకు బ్రహ్మానందము కలిగించి మనుష్యుని పరమేశ్వరునిగా మార్చుట కేమి, సాధన మగునది భాషయే అనియు, అది ఒక్క మానవజాతికే సాజమగు గట్టిసొత్తనియు తేలును.)

భాషాచరిత్ర

మనుష్యులకు ఎన్ని చందములనో పనికివచ్చుచు, ఎన్నిక చెందుచున్న భాష ఎట్లు పుట్టి పెరిఁగినదో ఎఱుంగ యత్నింతము. భాష పుట్టిన తెఱంగు సహజముగా ఇట్టులుండు

నని తెలుపఁజాలక, తొలిమనుజులకు దేవుఁడే భాష ఇచ్చె నని కొంద అనిరి. ధ్వనికిని, అర్థమునకును సహజసంబంధము కలదు కాన ప్రకృతినుండియే భాష పుట్టినదని కొంద అనిరి. కాని ఈ మాటలు భాషాశాస్త్రజ్ఞులు పాటింపరైరి. వారిలో కొందఱు సహజధ్వనులనుబట్టియు, కొందఱు నొప్పి మెప్పు మొదలగువానిచే కలుగు మనోవికారములను తెలుప వెలు వడు ధ్వనులను బట్టియు, కొందఱు సర్వసామాన్యముగా చేయు పనులతోపాటు సహజముగా వచ్చుధ్వనులను బట్టియు, భాష పుట్టె ననిరి. ఇందు ఒక్కొకటి భాషలో ఒక్కొక భాగము పుట్టిన తెఱఁగే తెలుపును. మూఁడును కలసినను, భాషలోనిభాగము లెల్లను పుట్టుటకు కారణము తెలుపఁ జాలవు. అందు ముఖ్యముగా భాషలోఁ ముఖ్యభాగములు గాని, దానిచిక్కు కూర్పంతయుఁ గాని ఏర్పడుటకు కార ణము తేటపఱుపఁజాలవు. ఇంతియకాక, పై కారణములు భాష ఏర్పడువఱకును మనుష్యులు మూఁగలై ఉండినటులు కూడ సూచించును. కాన భాషావయవముల పరిశ్రమము చేసి, సరిగా భాష అని చెప్ప వీలులేని ఏదో సాధనమువలన తలంపులు మొదలగునవి తెలుపుకొనుచు, దానివలన భాష ఏర్పడుటకు మనుజులు దారిచూపి రనుట, ఇంతకంటె నిజము నకు దగ్గఱగా ఉండునని కొందఱు నుడివిరి. దీనికి బిడ్డలు భాష నేర్చుకొనురీతి కొంతవఱకు తార్కాణగా కైకొనఁదగు.

భాష పుట్టినగుట్టు కనుపట్ట మేక్సుముల్లరు, విట్నె మొదలగు పండితులు తమబుద్ధికొలఁదిని యత్నించి తట్టిన దేమో తెలిపిరి. తుదకు జెస్పెర్సెన్ పండితుఁడు గట్టిప్రయత్నము చేసి, ఇప్పుడున్న భాషారూపమునుండి వెనుకకు పరికించుచు పోయినయెడల, మొట్టమొదట సరిగా భాష అనిపించుకొనఁజాలని కొన్నిధ్వను లుండినట్లు తేలుననియు, ఇప్పటిభాషను తొల్లింటిభాషతో పోల్చి చూచినయెడల భాష పెరుఁగుటకు సాయపడు సామాన్యధర్మములు కనుఁగొనుటకు వీలుగా ఉండుననియు తెలిపె.

జెస్పెర్సెన్పద్ధతి ననుసరించి మిక్కిలి తొల్లింటి బాసయేర్పాటు పరికించుచో, పందొమ్మిదవ శతాబ్దిలోని భాషాశాస్త్రజ్ఞులు తలఁచినటులు భాష ఏకాక్షర పదములతో ప్రారంభ మగుటకు మాఱు, నిడుదపలుకుగములతో ఏర్పడినట్లు తేలును. ఇవి నడుమనడుమను ఆఁపుచు, వింత వింత యెసలతో, ఇప్పటి నాగరకభాషను ఒకటేరకపు స్వరముతో పలుకునటులు గాక, పాటపాడినట్లు స్వరభేదముతో పలుకుచుండెడివారఁట! భాషాచరిత్రములో వెనుకకు వెళ్లినకొలఁదిని, లింగము - వచనము - విభక్తి - కాలము మొదలగునవి తెలుపుటకు చేయునుడుల మార్పులలోను, వాక్యములలోను మాత్రము కాక, పదసమూహములలోఁకూడ అక్రమములు హెచ్చుగా కానవచ్చునఁట! ఒక వస్తువును ఎప్పుడును

ఒకటే తెలుఁగుగాఁ గాక, పెక్కు తెలుఁగులుగా తెలుపుచుండెడివారఁట! ఇప్పటి భాషలోవలె సామాన్యజాతివాచక పదములు గాక, ఒక్కొక్కదానికి ప్రత్యేకముగా రూఢ్యర్థములు గల పదములు వాడుచుండెడివారఁట! నుడులు నిడుదలైన కొలఁదిని అవి తెలుపు తలంపులు బిగితప్పి పలుచపడునని తలంపక, తొల్లింటివారు పిల్లలవలెనే కేక లిడుచు, పాడుచు, అర్థమున్న నుడులే కాక అర్థము లేనివియు నేడుక తీర్చుకొనుటయే ముఖ్యముగా చేసికొని ఇచ్చవచ్చినట్లు పలుకుచుండెడివారఁట! తలంపులు తెలుపు సాధనముగా పరికించుదో వారిభాష మోటుగాను, వెగటుగాను, సరిగా ఉద్దేశమును నెఱవేర్పనిదిగాను, ఉండెడిదఁట! అది వారి మనోవికారములను వెల్లడించుటకు మాత్రము పనికివచ్చుచుండెనఁట! వారికి ముఖ్యముగా కావలసినదియు అంతేనఁట! పై చందమున ఏర్పడిన భాష ఇప్పటి మోటుమానిసి కోవ వారిబాసవలె కాసటబీసటగా ఉండెడిదఁట! ఇంతకు దీనికి వింతపడనేల? ఒకటి రెండు వేల యేండ్ల క్రిందటి భాషారూపమందే ఇప్పటిదానికంటె ఎంతో కొంత భేదము కనఁబడుచుండ, పెక్కు వేల యేండ్లక్రిందటి భాషారూపము నేఁటిదానికంటె మిక్కిలి భిన్నముగా ఉండకుండు టెట్లు? అటులయిన మొట్టమొదటి భాషారూపము సరిగా మనము తెలిసికొనఁగలుగు టెట్లు? మొదటి మానిసిమది ఎటు పనిచేసినదో

మన మది సరిగా గుర్తింపఁగలుగు టెట్లు? ఇప్పుడు మనకు తెలియవచ్చిన భాషారూపములలో మిక్కిలి ప్రాచీన మైనది కూడ పెక్కువేలయేండ్లు మాఱఁగా మాఱఁగా ఏర్పడిన దే అని తేలునపుడు, మొట్టమొదటి భాషారూపమును సరిగా గుర్తింపఁ గలుగుటకు చేయుజతనము అందని ప్రమానిపండు కొఱ కఱ్ఱుచాఁచుటకాదా? అని నిర్వేఱ పొడమవచ్చును. కాని నిర్వేఱపాటు పరిశోధకుల లక్షణము కాదు.

కాన భాష పుట్టినప్పటిరూ పెట్టిదో కనుపట్టుటకు పట్టుదలగల పరిశోధకులు కొందఱు ప్రయత్నించుచుండ, తక్కినవారు లభించిన భాషారూపములలోని భేదములను పరికించి దానివలన కనుఁగొన వీలగు అంశముల నైన కనుఁగొని, మే లొందఁ యత్నింపవలయును. ఏ మందురా? భాషాచరిత్రమును తెలిసికొనవలయు నను ప్రయత్నము చరిత్రకాలమున నైన మొదటినుండియు జరుగదయ్యె. ఆయా దేశములవారికి తమతమభాషలును- భాషాభిమానులకు చుట్టుపట్టుల భాషలును మాత్రము - తెలియును గాని, భూమండలములోని పెక్కుభాషలనుగూర్చి ఏమియు తెలియదయ్యె. కొలఁదికాలము క్రిందటనే - క్రైస్తవమతబోధకులు తమ మతబోధకై పలు దేశములకుపోయి పెక్కుబాసల యునికి తెలిసికొని, అవి నేర్చుకొనుటకు కృషి చేసిరి. భాషాశాస్త్రజ్ఞులు వానిని పరిశోధింపఁ దొడంగిరి. అందువలన వాని

యిప్పటి స్థితియో, ఇప్పటికంటె కొంచెము వెనుకటి స్థితియో మాత్రము తెలియవచ్చును గాని, తొల్లింటిస్థితి తెలియరాదయ్యె. అదృష్టవశమున కొన్నిభాషలకు చిరకాలమునుండి వ్రాఁత ఉండుటచేత అందు కొన్నింటినిగూర్చి కొన్నినూర్ల యేండ్లవఱకును, కొన్నింటినిగూర్చి కొన్నివేలయేండ్లవఱకును వెనుకకుపోయి, అప్పటిస్థితి కనుఁగొనుటకు వీలు కలుగుచున్నది. కాని, అట్టిభాషల విషయమున సైతము, వ్రాఁతలేని వేలకొలఁదియేండ్ల కాలముతో పోల్చిచూఁచునెడ - వ్రాఁత ఉన్నట్లు తెలియవచ్చినకాలము చాల తక్కువదే. అదియునుగాక - భాషాపరిశోధనమునకు, తన కున్న కొఱంతలంబట్టి మొత్తముమీఁద వ్రాఁత, మిక్కిలి కొఱవడిన సాధనమే అనక తప్పదు. దీనికి ఈజిప్టుబొమ్మల వ్రాఁతయు, అచ్చు లేవో హల్లు లేవో తెలుపని సెమిటిక్కు వర్ణమాలికయు, చీనాభాష వ్రాఁతయు తార్కాణములు. సంస్కృతము, గ్రీకు, ల్యాటిను, ప్రాఁతతుర్కీ మొదలగు ప్రాచీన భాషలలో హల్లులకే కాక, అచ్చులకును వేఱుగా వ్రాలుండుటచే వానివలన కొంత హెచ్చుబోగట్టా తెలియవచ్చుచున్నది. కాని, ఉత్తమవర్ణమాలికలుకూడ, పెక్కునాజూకు రవళితేడాలను— ధ్వనుల గుణములలోను, కొలఁదులలోను, నొక్కుబడిలోను, పలుకుబడి మొదలగువానిలోను— సరిగా వెల్లడింపఁజాల కున్నవి. ఈధ్వనిగుణాదులు మాటలాడు భాషలో ముఖ్యము లగుటయేకాక, భాష పెంపొందుటలో

ఎంతో హెచ్చుగా పనిచేయును. మాటలాడుటయు, వ్రాయుటయు రెండు ప్రత్యేకేంద్రియములతో సంబంధించినపనులు కాన, ఒకటిగా కలియఁదగినవి ఎంతమాత్రము కావు. మాటలాడు భాషయే నిజమగు భాష. వ్రాఁతభాషయో దానిని తెలుపు గుఱుతుల భాష. అందుచేత - మిక్కిలి చక్కగా ధ్వనులను తెలుపు వ్రాఁతసైతము, మాటలాడు భాషను గూర్చి చేయుకృషికి, కాలము కడపుకొనుటకు మాత్రము తగు సాధనమే కాని, అంతకంటె మంచిసాధనము కానేరదు. ఇట్టిచో - వ్రాఁత, భాషాచరిత్రము సరిగా తెలుపఁగల సమర్థమగు సాధన మెట్లగును ? ఈ విషయమున మన తరువాతి తరమువారికి గ్రామొఫోను రికార్డులు లభించును గాన, భాషాకృషిలో మనస్థితికంటె వారిస్థితి కొంత మెఱుఁగుగా ఉండును.

ధ్వనులమార్పును, అర్థముల మార్పును, నుడులవాడుక మార్పును, కనుపట్టి - పరిశోధకులు భాషాచరిత్రము కూర్పవలయును. ఇట్టిపరిశోధనము జరుగకముందు, నుడుల ఉత్పత్తి ఊహించి చెప్పుచుండెడివారు. ఇప్పుడు ధ్వనులమార్పును బట్టియు, అర్థములమార్పునుబట్టియు, పరిశోధించి మునుపటికంటె కొంతవఱకు సరిగా చెప్పఁగలుగుచున్నారు.

ఇటులు ఇప్పటి భాషాపరిశోధకులు - తెల్లవారు - తెలుపుచున్నారు.

ఇఁక, తొంటివా రేమిచెప్పినారో పరికించి చూడనగు :

"అక్షరము పరమనాదము, అదే శబ్దబ్రహ్మము. నాదా(శబ్దా)ధార మగు శక్తి మూలాధార చక్రమున అవ్యక్త రూపముతో ఉండును, దీనికి 'పర' అని పేరు. ఈ పరాశబ్ద శక్తినుండి, చిన్నవిత్తునుండి మొలకపుట్టినట్లు, నాదము పుట్టును; దీనిచేత యోగులు విశ్వమును చూతురు; కాన, దీనికి 'పశ్యంతి' అనుపేరు వచ్చె (దీని మనికిపట్టు మూలాధారమునుండి నాభి వఱకు). పశ్యంతినుండి వెడలుధ్వని నేను గంభీరమయినది; దీనిని 'మధ్యమ' అందురు. (దీని మనికిపట్టు నాభినుండి హృదయమువఱకు). ఈ మధ్యను స్వరసహితమై, వైఖరి అగును. (దీని మనికిపట్టు హృదయమునుండి కంఠము వఱకు). ఈవైఖరి, కంఠము - తాలువు మొదలగుచోట్ల తగిలి, 'అ' మొదలగు అక్షరములుగా మాఱును. అక్షరములు కలసి పదములగును. పదములుకూడి వాక్యము లేర్పడును......వాక్యములు చేరి వివిధభాషలగును ........ఇట్లు భాష, అగ్నితోకూడిన వాయువు ప్రేరేపింపఁగా, ద్విత్రివర్గ పదములతోడి వాక్యములుగా రూపొందును." - యోగశిఖోపనిషత్తు.

"భాష పరలో మొలకెత్తును; పశ్యంతిలో మాఱాకు వేయును; మధ్యమలో మొగ్గతొడుగును; వైఖరిలో పూచును."

"వృక్షములలో పుట్టునది పర; భూజలములందు పుట్టునది పశ్యంతి, పశువులనోట పుట్టునది మధ్యమ, మనుష్యుల నోట పుట్టునది వైఖరి."

"ఉన్మేషము (స్ఫురణము) పరనుండియు, ధ్వని పశ్యంతి నుండియు, నాదము మధ్యమనుండియు, శబ్దము వైఖరి నుండియు పుట్టుచున్నవి. వైఖరి నానాశబ్దరత్నములను వెల్లడించును." - దాసబోధము.

ఇట్టు భాషోత్పత్తినిగూర్చి వైదికమతమువారు — ఆర్యులు — చెప్పిరి. భాషాచరిత్రమును గూర్చి దివ్యజ్ఞాన సమాజమువారు కొందఱు వ్రాసియున్నారు. అది తెలిసిన పదప తెలుపమి తప్పు వారిలో నాయకమణి అగు బ్లావెట్స్కీ-అమ్మ తన "సీక్రెట్ డాక్ట్రిన్" II సంపుటములో ఏమి చెప్పెనో కనుఁడు :

" మొదటిజాతివారు — దివ్యయోగపుత్రులు, ఆత్మభువులు — మన భూమండలమున మదిలేనివా రగుటచే, మన తెలివినిబట్టిచూచు వో, భాష లేనివారే. రెండవజాతి వారిది ధ్వనిభాష-స్వరములతోనే ఏర్పడిన సంగీత సదృశ ధ్వనుల భాష. మూఁడవజాతివారు స్వేదజులు - మొదట ఒకవిధమగు భాషను పొందించిరి ; అయినను, అది అప్పటి పెద్దపురుగులయు, తొలిమొకములయు రొదల కన్నను, అఱుపులకన్నను కొంత మెఱుఁగనిమాత్రము చెప్పఁదగిన దే.

కాని, ఆ మూఁడవజాతి రెండవ సగమున—ఆజాతి మధ్యకాలమున స్వేదజులవలెను అండజులు పుట్టినప్పుడును, వీరు పేడివారిని 'హొదుగుట' మాని-స్త్రీ పురుషులుగా విడిపోవ మొదలిడి—ఆపరిణామ సిద్ధాంతమును బట్టి స్త్రీపురుషసంయోగమువలన బిడ్డలను కనవలసి వచ్చినపుడును, కర్మసిద్ధాంత బద్ధులై-పితృదేవతలు మదిలేని మనుష్యులలో అవతరింపవలసి వచ్చె. అప్పుడే భాష పెంపొందె; కాని, అప్పటికిని అది అతుకుల బొంతయే. మానవజాతి కంతకును అపుడు భాష ఒక్కటే."

దీనినిబట్టి, అంతవఱకును భాష సరిగా ఏర్పడలేదనియు, పెక్కు-భాషలుగా విడిపోలేదనియు తెలియవచ్చును.

"అంత, ఈ క్రింది క్రమమున భాష పెరుఁగఁదొడఁగె:

I. ఒంటి-ఉల్లిపునుడిపలుకు—ఏకాక్షరపదభాష : ఇది మనుష్యులు స్త్రీపురుషులుగా విడిపోయినపిదప, వారి మనస్సులు పూర్తిగా పనిచేయ మొదలిడినపుడు, మూఁడవ జాతి కడపటికాలమున - దాదాఁపుగా మానవజాతి తగినటులు రూపొందినయెడ, బంగారు రంగు మేనివారు మాటలాడిన భాష. అంతకుమునుపు, ఆత్మభవు లగు యోగపుత్రులు తప్ప-తక్కినవారు, తలఁపు అప్పుడప్పుడే పెంపొందఁదొడఁగుటచే, సరిగా మాటలాడఁజాలక పోయెడివారు... ... హేతువాదశక్తి బాగుగా పట్టువడి - పెంపొందువఱకును, పలుకును

బాగుగా పెంపొందఁజాలకపోయె. ఇప్పటికిని పసుపు జాతుల వారు పరుషాక్షరములతో చేర్చి-వాడుచుండు ఒంటి-ఉలివు నుడిపలుకులకు, తొంటి యీ ఒంటి-ఉలివునుడి పలుకే, ఒక చందమున 'స్వరమాత' అని చెప్పవచ్చును ఇందు ఒక్కొక నుడికి ఒక్కొక ఉలివే (అక్కరమే) ఉండును.

II. జంటనుడిపలుకు — ద్విపదభాష · ఒంటి-ఉలివు నుడిపలుకు, పుట్టుమెఱుఁగులనుబట్టి నానాఁటికి జంటనుడి పలుకులుగా మాఱి, పెరిఁగె. ఈ జంటనుడిపలుకులు (నాల్గవ జాతివారగు) కొన్ని అట్లాంటి యను చిఱు తెగలవారు మాటలాడుచుండిరి. కాని, పేరు పొందిన మఱికొన్ని చిఱుతెగల వారు తల్లి పలుకే—మొదటి దగు ఒంటి - ఉలివు నుడి పలుకే-విడనాడక మాటలాడుచుండిరి. అయినను, భాషలకు కాలము కడచినకొలఁదియు బాల్యమును, స్వచ్ఛతయు, వృద్ధియు, పతనమును, అన్యభాషా సాంకర్యమును, యౌవనమును, క్షయమును, తుదకు మరణమును (........ ... ......) అపరిహార్యము లగుటచే, ఉత్కృష్ట నాగరికులయిన అట్లాంటి యను తెగలవారి ప్రాచీనభాష—సంస్కృత గ్రంథములలో పేర్కొనిన రాక్షసీభాష—క్షీణించి, ఇంచుమించుగా నశించె. నాల్గవ తెగలో మెఱికలగు ఒక చిఱుతెగవారు మేని ఛందముల మేలిమార్పునందు మిన్నందఁగా, వారి పలుకుకూడ ఎంతో ఏపుగా ఎదిగి, చేర్పులపలుకుగా - ప్రత్యయభాషగా-

మాఱె. ఈ చేర్పులపలుకు ఐదవ (ఆర్య) జాతివారికి వార
సత్వపుటాస్తిగా వచ్చి, కొనలు సాగఁదొడఁగఁగా, జంటనుడి
పలుకు నానాఁటికి ఏపుతగ్గి, చెదరిపోయె. దాని చివుకు కొంచె
ముక్క నుడి మఱుఁగులు (భాషీయములు) అమెరికాతొలి
కాఁపుల పలుకులలోనే ఇపుడు కానవచ్చును.

( III. చేర్పులపలుకు—ప్రత్యయభాష : సంస్కృతము
నకు మూలమగు భాష - గ్రీకుభాషకు తల్లి అనుటకుమాఱు
తప్పగా 'అప్ప' అని కొందఱు చెప్పునది - చేర్పులపలుకులలో
మొదటి భాష, అదే అయిదవ తెగలోని సిద్ధుల యిప్పటి
గుట్టుపలుకు. సంస్కృతపు తల్లిభాష నానాఁటికి మాఱి,
పెక్కుపలుకులయ్యె, వానిపలుకుబడి చెడిపోయె, అట్టివానిలో
మొదటిపలుకులనుండి పుట్టిన సంకరభాషలే సెమిటిక్
భాషలు.. " )

తొంటిచరిత్రమునుగూర్చి—అది దేశచరిత్రము కా
నిండు; భాషా చరిత్రము కానిండు, మఱొకటి కానిండు -
ఏప్రాపును లేనియెడ మన తెలివినిబట్టియే తలపోసి నిజము
కనుఁగొనుటకు కడంగుట, చిమ్మచీఁకటిలో ఏ వెలుఁగుతోడ్పా
టును లేక, దేనికొఱకో తడవుకొనుటయే, కావలసినది
దొరకవచ్చును; దొరకక పోవచ్చును. తెల్లవారి యిప్పటి
అరయిక అట్టిదే. అయినను, పట్టుదలబలిమి వింత అయినది;
అది ఏమయినను చేయఁగలదు. కాన, వారి అరయిక కొంత

వఱకు ఫలించుచున్నది. పట్టుదల అనఁగా చేయఁదలఁచు
పనియందు చెదరనీయక డెందమును పట్టి నిలుపుటయే. డెందపు
టెక్కటి నిలుకడవలన ఎఱుకప్రోవగు-ఎల్లతేనినే కనుఁగొన
వీలగునపుడు తక్కినవానిమాట చెప్పనేల? జెస్పెర్సన్
పండితుఁడు ఎక్కటి నిలుకడతో పలుకు పుట్టుకనుగూర్చి
తలపోసి, అపుడు తట్టినది తెలిపె. అది కొంతయే అయినను
నిజ మని మేలెఱుకవారి వ్రాఁత తెలుపుచున్నది.

తొంటిచరిత్ర సరిగా తెలిసికొనుటకు ఇపుడు ఎవరికిఁ
గాని మేటిప్రాపులు రెండే: ౧. మన పురాణముల సమూ
హము, దానిలోని నిజము, ఎఱుకగలవారితోడ్పాటు లేక,
తెలియరాదు. ౨. 'సీక్రెట్ డాక్ట్రిన్;' ఇదియును అంత
సులువుగా ఆకళింతకు వచ్చునది కాకున్నను, పురాణముల
కంటె తేటతెల్లముగా ఉండును కాన, మొత్తముమీఁద
మానవజాతిచరిత్ర సరిగా తెలిసికొనఁగోరువారును, తమ
తెలివిచే తలపోసినది సరి అగునో కాదో ఎఱుంగఁదలంచు
వారును ఈ మేలిపొత్తము తప్పక చదువవలె. ఉన్న ప్రాపు
లనుబట్టి ద్రావిడులనుగూర్చి నాకు తట్టిన తలంపు తప్పిపోక
నిక్కమని తేలుటయే కాక, దీనివలన ఎంతో ఎఱుక ఎన్ని
టిని గూర్చియో నాకు కలిగినది. దేనినిగూర్చియేని నిజము
తెలుపు మేలితలంపుతో అరయుచుండువారు ఎవరేని - ఇది
తప్పని సరిగా చదివి తీరవలెననియు, అటు చేయనిచో నిజము

గుర్తించి - తెలుఁగువస కలుగదనియు నామదికి నాటినది. దీని ననుసరించి వ్రాసిన మేలెఱుక పొత్తములును దీనివలెనే చదువఁదగినవే. నిజ మెఱుంగుటకు వెరవులు లేనివారు, ఉన్న వెరవును పాటింపమి పాడి కాదుకదా! కాన, మన తెల్ల తోఁబుట్టువులు వ్రాసిన అరయిక పొత్తములతోపాటు, మేలెఱుకవారి పొత్తములును మనవారు అరసి, మేలొందుదురుగాక!

ద్రావిడులు 3-వ జాతులవారి సంతతివారనియు, ఆర్యులు ౫-వ జాతివారనియు మేలెఱుకపొత్తములు తెలుపుచున్నవి. దానినిబట్టి ద్రావిడులభాష ఆర్యులభాషకంటె ముందుది అనుట స్పష్టము.

### భాషాభేదములు

సాధారణముగా భాష మాటలాడుభాష, వ్రాయు భాష - అని రెండు తెఱంగులు. చాలకాలమువఱకు భాష ఒక్క మాటలాడు భాషగానే ఉండెడిది. పిదప భాషాధ్వనులకు గుఱుతులు కల్పించుకొని, వ్రాయ మొదలుపెట్టినారు. ఆవ్రాఁత ఎవరికి తోఁచినట్లు వారు వ్రాయుచుండుటచే, అందు కొంతభేదము కనఁబడ మొదలిడె. భాష మాటలాడుటలోకంటె వ్రాఁతలో హెచ్చుగా పెంపొందును; దానికి బదులు హెచ్చుగా సాయపడె. మాటలాడు నుడులను వీలగునంతవఱకు పల్కినట్లే వ్రాయుదురు. కాని, ఒకవిధముగా

వ్రాయుట అలవాటుపడిన తరువాత - పలుకుబడి మాఱి నను దానికి సరిగా వర్ణక్రమము మాఱక, మొదటి వర్ణక్రమమే కొన్ని యెడల నిలిచిపోవుట తటస్థించినది. ఇటులు నానాఁటికి నుడులరూపు మాటలాడుటలో ఒకచందముగాను, వ్రాయు టలో ఒకచందముగాను ఏర్పడి, ఆ భేదము హెచ్చినది. కొన్ని భాషలలో, పలుకుబడి మాఱినను, పై భాషలలోనుండి వచ్చిన నుడులను మొదటి వర్ణక్రమముతోనే వ్రాయుట మానరైరి. ఇందులకు యజ్ఞసంజ్ఞాది సంస్కృతపదములును, ఇంగ్లీషులోనికి వచ్చిన ఫ్రెంచినుడులును ఉదాహరణములు. ఈ భేదమును తొలఁగించి - పలుకునట్లే వ్రాయుటకు ప్రయ త్నింపఁగా, కొన్ని దేశములలో అది సాగినది; కొన్ని దేశ ము లో సాగలేదు.

భాషను తెలిసికొనుటకు వాడునట్టి యింద్రియములను బట్టి - మాటలాడు భాష చెవిభాషయు, వ్రాయుభాష కంటి భాషయు అగును. కంటిబాసకంటె చెవిబాస ఎంతో మిన్న అగుట నిజము.

కంటిబాస పెక్కుచందములుగా ఉండును. అందు, చేతులతోడను, మొగముతోడను చేయు సంజ్ఞలు మొదట పేర్కొనవలెను. వీనిలో కొన్ని ప్రయత్నము లేకయేవచ్చును. అవి సంపూర్ణముగా సహజములు; అనఁగా తమంతట తామే వెంటవెంటనే వచ్చును. మఱికొన్ని సహజములు కావు;

పనిపట్టి ఏర్పఱచుకొన్నవి; ఇవి శ్రద్ధపట్టి నేర్చుకొనవలె. ఇటులు ప్రత్యేకముగా పెంపొందినది అమెరి కైందవులు కొందఱు వాడు సంజ్ఞాభాష; తక్కినవి ఆయాదేశములలో నేరగాండ్రు మొదలగువారు వాడునవి. కొలఁదిగనో గొప్పగనో ఏర్పాటుతో కూడిన కంటిభాషలు - పువ్వులభాష, బొమ్మలభాష, జెండాసంజ్ఞలభాష, కనఁబడు తంతివార్తల భాష, తుదిది — అన్నింటిలో మిన్న అయినది — వ్రాఁత భాష + అచ్చుబాష. బొమ్మల భాషతో ప్రారంభమై, పెంపొంది, వ్రాఁతభాష వేఱుకాఁగానే-అది మాటలాడు భాషపై ఆధారపడి, భాషాధ్వనులను తక్కువగనో హెచ్చుగనో తెలుపునదే అగును. ఇందువలన — వ్రాఁతభాషలు, తమ కాధారము లైన ధ్వనిభాషలనుబట్టి చూచినపుడు, రెండవ తరగతిభాషలే కాని-మొదటితరగతిభాషలు కావు చెవిటి మూఁగలకు నేర్పుకృత్రిమవర్ణముల వ్రేళ్లభాష, వారికి సహజమగు సంజ్ఞాభాషగా వ్రాయు ఒకవిధమయిన బొమ్మల వ్రాఁతయే, దానికిని మాటలాడు భాషకును ఎట్టి సంబంధమును లేదు; అదియును రెండవతరగతిభాషయే. అయినను చెవిటిమూఁగలకు చదువుట నేర్పునపుడు, మాటలాడుభాష చూచున దగును — అనఁగా చెవిభాష కంటిభాషగా మాఱును.

ఏవిధమగు కంటిభాషతోఁ గాని పోల్చి చూచునపుడు చెవిభాష కంటిభాషకంటె ఎంత మేలయినదో తేటపడును.

చెవిభాషలో భాషావయవములు (ఊపిరితిత్తులు, ధ్వనినర ములు, నోటిలోని మెత్తని పైకప్పు, నాలుక, పెదవులు, లోదవుడలు, పండ్లు) సులువుగా తెలిసికొనఁదగు పెక్కురక ముల ధ్వనులను పుట్టించి, చేతులు మొదలగు తక్కిన శరీరా వయవములసాయము లేకయే పలుకఁగలవు; ఇవి చీఁకటిలో నైనను—వెలుతురులో నైన తగినంత దవ్వుననుండి, మాట లాడువారును-వినువారును, ఇటులుండవలె - అటు లుండవలె నను నిర్బంధము లేకయే వినవచ్చును. ఇందువలన చెవిభాష కంటిభాషకంటె మేలైన దని తేలినను, అదియు కంటిబాస సాయ మక్కఱ లేనంత మేటిబాస కాదు; ఇపుడుకూడ నాగరకజాతులలో నేమి, ఇంకను హెచ్చుగా అనాగరక జాతులలో నేమి, ఆడినమాటలను సరిగా తెలిసికొనుటకు అభినయమును-అనుకరణమును ఎంతో తోడ్పడుచున్నవి. ఈ సాయము కొన్ని జాతులవారు వదలుకొనఁజాలమిచే చీఁకటిలో మాటలాడఁజాలకున్నట్లు చెప్పుదురు. ఇందు కొంత అతిశ యోక్తి ఉండునేమో!

మాటలాడు భాషను సరిగా తెలుపఁజాలకున్నను వ్రాఁత + అచ్చుభాష కంటిభాషలలో మిన్నయై, మిక్కిలి పనికివచ్చుచు, ఎంతో మేలు చేయుచున్నది. నిజమునకు చెవిబాసపస ఎదుట నున్నప్పుడే హెచ్చు; తక్కినయెడల కంటిబాసదే పెద్దపీకము. కాని కొత్తగా బయలుదేఱిన గాలి

వార్తల యంత్రములు ఏరివిగా పనిచేయుటకు వీలు కలుగు నెడల ఇప్పటిస్థితి మాఱి, చెవిబాస కంటిబాస పెద్దతేకవ చాలవఱకు తగ్గింపవచ్చును.

ఉపభాషలు

ఎప్పుడుగాని ఏదో భాష పెక్కురు వాడుచుండునప్పుడు, అది వాడుచుండు ప్రదేశములలో వానితో సంబంధించునట్టియో సంబంధింపనట్టియో భేదములు కొలఁదిగనో గొప్పగనో కలుగక తప్పవు. చోటులనుబట్టి వచ్చు భాషాభేదములకు సాధారణముగా ఉపభాష లందురు.

ఉపభాషలకు హద్దులు మిక్కిలి తఱచుగా రాకపోకలకు వీలులేని అడవులు - ఉప్పుపఱ్ఱలు మొదలగు సాజపుటడ్డులగవచ్చును. ఇప్పుడివి పెక్కుచోట్ల పోయినవి; పోవుచున్నవి. ఇఁక నదులన్ననో దాఁటరాని చోటులనే హద్దులు; రాకపోకలు జరుగు కనుమలతోడి కొండలును హద్దులు కాఁజాలవు. ఇందువలన మొత్తముమీఁద సాజపుటడ్డులు కాక మనుష్యుల స్థితిగతుల భేదమే హద్దుల నిర్ణయమునకు ముఖ్య ప్రమాణముగా కైకొనవలయును.

సంబంధముచే సామ్యమును — సంబంధము లేమిచే భేదమును కలుగు ననునదే భాషాజంతుశాస్త్రముమొదలి ముఖ్య ధర్మము. ఇప్పటివలె రాకపోకలకు వీళ్లు లేమిచే మునుపు

జనులు మిక్కిలి విడిపోయి, ఒండొరులతో సంబంధము లేకుం డెడివారు. అందుచే ఒకేభాష మాటలాడువారే విడిపోయి నపుడు వారి భాషలో భేదము కలుగుట సంఘటిల్లినది. తొలి భాషతో సంబంధము లేకపోవుటయే కాక కొన్ని యెడల పైభాషల సంబంధము హెచ్చగుటయు సంభవించును. అట్టిచో ఉపభాషలు స్వతంత్రభాష లగును. ఇపుడు భాషా సామ్యము మునుపటికంటె బాగుగా నిలిచియుండుటకు తెర వులు పెక్కులు వెలసినవి. కావున మునుపటివలె ఇంకముందు ఉపభాషలలో గొప్పభేదము కలుగుటకుఁ గాని, అవి స్వతంత్ర భాష లనుటకుఁ గాని అవకాశము కానరాదు.

తక్కినభాషాభేదములు

ఒకసంఘములోనె మెలఁగుచుండుజనులు కొందఱు పైవారికి తెలియని భాషారూపములను కల్పింతురు. ఇటులు కల్పింపఁగా ఏర్పడినవే నేరగాండ్రభాష, బేరగాండ్రభాష, పారిభాషికభాష, మోటువాండ్రభాషయు, కుఱ్ఱవాండ్రభాష యుకూడ వీనిలో చేరును. అయినను ఉపభాషలు, ధ్వనిభేద ములవలనను, నుడిమార్పులలోని భేదములవలనను ఏర్పడు చుండ, ఇవి పదభేదమువలనమాత్రము ఏర్పడును.

ఆయాసంఘములలో పైతరగతివారిభాషకును, క్రింది తరగతివారిభాషకును భేదము కలుగును. అది సంస్కృత ప్రాకృతములకు ఉన్నంతది మాత్రము కాకపోవచ్చును.

సంభాషణములో గొప్పవారితో మాటలాడుభాషకును, కొద్ది
వారితోమాటలాడుభాషకును భేదము కొంత ఉండును.

సాధారణముగా మాటలాడునపుడు వాడు సులువగు
భాషకును, సభలలోను- పద్యకావ్యములలోను వాడుభాష
కును భేదము కానవచ్చును. ఈ భేదము మతవిషయము
లలో హెచ్చు. కొన్నియెడల పురోహితులకు సహా ఆభాష
తెలియదు.

కొన్నిపదములకు మంత్రబలము కల దని కొందఱు
నమ్ముదురు. కొన్ని దేశములలో పురుషులు వాడనిపదములు
పెక్కులు స్త్రీలు వాడుదురు. కొన్నియెడల ఈ అలవాటు
స్త్రీలభాష వే ఱనునంత హెచ్చుగాకూడ ఉండును.

ప్రమాణభాషలు

చారిత్రకకాలమున మిక్కిలి ముఖ్యములగు అంశము
లలో, గొప్పజాతీయభాషలు- ప్రమాణభాషలు బయలుదేఱి
స్థానికోపభాషలను త్రోసిరాజుచేయుట ఒకటి. ప్రమాణ
భాషలు మాటలాడువారు తమభాషవలన తా మెక్కడివారో
తెలియనీయరు. పలుజిల్లాలనుండి వచ్చుజనులభాషలలో సహ
జముగా ఆయాచోట్ల నుండువింతలును-సులువుగా పట్టుపడి
పైవారు వెక్కిరింప వీలగుచిన్నెలునుమాత్రముగాక, స్థానిక
భాషీయ మనిపించుకొని-వర్ణింప వీలొసంగక, కష్టమునొంద

గాని కనుఁబట్టనివిభేదములుకూడ పోవునట్లు చేయుసాంఘిక సంబంధమును సమకూర్చుటకు ఈక్రింది పెక్కువిషయములు పనిచేయుచున్నవి:—

మతసంబంధములగు మహోత్సవములును, వ్యాయామ సంబంధములగు సమావేశములును—వీనిలో కొన్ని గ్రీసులోని ఆలింపియన్ క్రీడలవంటివి, మతసంబంధముకూడ కలవి—స్థానికవిశేషములను పోఁగొట్టుటకు ముఖ్యకారణము లైనవి. ఇట్లు ప్రాంతవాఙ్మయము బయలుదేరుటకు చాలకాలము ముందు, నానాతరాజులకొలువులకూటములు సందర్శించుచు-తమపాటలును, పద్యములును కొందఱు వినిపించుచుండుటయు దీనికి మఱొకకారణము. కృతికర్తలు తమకావ్యములలో ఒక చోటిభాషయే వాడక పలుచోట్లభాషు కలిపి వాడుట ఇంకొక కారణము. దేశములవెంబడి తిరుగుచుండు నాటకసమాజముల వారిభాష వినుచుండుట కొండొక కారణము. నాటకజర్మన్ భాష పలుప్రరించే ఉత్తమజర్మన్ భాషగా ఎన్నిక కాంచుచున్న దట! ఇఁక రాజకీయైకమత్యము మిక్కిలి ప్రాముఖ్యమువహించు కారణ మని చెప్పఁదగు. సామాన్యభాష తఱచుగా పైతరగతులవారిభాషయే! ఇటు లగుట వారు తమతో సమానులగు పైజిల్లాలవారితోడను, వారిబిడ్డలు బడులలో నేమి-విశ్వవిద్యాపరిషత్తులలో నేమి పలుచోట్లనుండి వచ్చువారితోను కలసి మెలసి తిరుగుటచేతనే. కాన ఇది వేఱొండు కారణము.

పైవాని నన్నింటిని మించినవిషయము పెద్దపెద్దపట్టణములు
బయలుదేఱుట, వీనిలో, ముఖ్యముగా రాజధానులలో, పలు
తావులనుండి వచ్చువారి భాషలలోనిభేదము లొండొంటితో
ఒరసికొని రాలిపోవును. ఈవిధమున ఒకటేసమయమున
పెక్కుశక్తులు పుట్టి కలసి పనిచేయుచుండుటవలన ఆయారాష్ట్ర
ములభాష లొండొంటిపొత్తువలన తొల్లిటిభేదములు పోఁగా ఏర్ప
డుభాషలే ప్రమాణభాషలు. ఇవి ఏర్పడుటకు పైని తెలిపిన
కారణములు ఇప్పుడు ఒక్కుమ్మడిని జరుగుచున్నంతబలిష్ఠముగ
ఇంతకుముం దెన్నఁడును జరిగియుండలేదు. ఇంతేకాక
క్రొత్తగా పైవిషయముల నన్నింటిని తలదన్నఁగల మిక్కిలి
శక్తిమంతమగుమఱొకవిషయము—గాలివార్తలవ్యాప్తి బయ
లుదేఱినది. దీనివలన దూరదేశములలో ఉండినను జనులు
సులువుగా ఒండొరులమాటలును- పాటలను వినుటకు వీల
గుచున్నది. గాంధిమహాత్ముఁడు లండనులో ఇచ్చిన ఉపన్యా
సము అమెరికాసంయుక్తరాష్ట్రములవారికి బాగుగా వినఁబడి
నదికదా! ఇందువలన ఇఁకముందు భేదములు పోయి భాషలు
సమత్వమునకు వచ్చుటకు వీలు హెచ్చుగా కలుగవచ్చును.

**భాషలమార్పు**

భాషలకు మార్పు సాజ మనుకొంటిమి. కాని ఇది ఎట్లు
కలుగును? ఆచారవ్యవహారము లెట్లు మాఱునో భాషలును
అట్లే మాఱును-అనఁగా రెండింటికిని ప్రాచీనతమ మగు కార

ణము మనుష్యస్వభావమే. ఇదికాక భాషలమార్పునకు మఱి
కొన్ని కారణములు ప్రత్యేకముగా ఉన్నట్లు పరిశోధనము
వలన బయలుపడినవి అంగు ధ్వనులు, తలంపులు—అను
భాషాపదార్థములస్వభావమును, సమకాలికులలో పెద్దలనుండి
ప్రతినూతనవ్యక్తికిని అవి చేరువిధమును ముఖ్యములు. మఱొక
కారణము పైభాషలు మాటలాడుచు వ్రాయుచుండునట్టి
వారితోడి సంబంధబలము.

ఒకరూపమున తొందరగా మాటలాడునపుడు కలుగు
క్షణికములగు మార్పులు లెక్కింపఁదగినవి కావు. కాని మఱి
కొన్ని మార్పులు పలువురు మాటలాడునపుడు పలుమాఱు
వచ్చుచుండును, ఇవి మనుష్యస్వభావమునుబట్టి మనస్సులలో
నాటుకొనియుండి పైకి వచ్చునట్లు గాని, ఆయాభాషల నిర్మాణ
మునుబట్టి వచ్చునట్లు గాని కానవచ్చును. కాబట్టి, ఇట్టివి
అప్పటికప్పుడు పోక నిలిచియుండుటకు యత్నింపఁగా, తుదకు
సర్వసాధారణములై, తప్పు లనుకొనుటకు వీలులేక, తరువాతి
తరములో ఆయాభాషల ముఖ్యభాగములుగానే ఎన్నఁదగిన
వగును. ఇట్టి మార్పులె భాషాచరిత్రకారులు కృషిచేసి, కను
పట్టవలసిన ముఖ్యాంశము లగవచ్చును. వీనిలో కొన్ని భాషా
శాస్త్రమున వివిధభాషలసంబంధమును నిర్ణయించుటలో నేమి,
కొన్ని నుడులకు ఉత్పత్తి వ్యుత్పత్తులు నిర్ణయించుటలో నేమి
చాల ముఖ్యములు. అయినను బాగుగా తెలిసినభాషలలో

కూడ భాషాచరిత్రకారు లెంత ప్రయత్నించినను ఉత్పత్తి దూరని నుడులు పెక్కులు లేకపోలేదు. దీనినిబట్టి భాషలోని నుడులకెల్ల ఉత్పత్తి వ్యుత్పత్తులు కల వనుకొనుటగాని, మఱొక భాషలోని నుడులకు అవి లేవనుకొనుటగాని పొరపాటే అని తెలియవచ్చును.

భాషాపదార్థములలో ధ్వనులు మాఱుటవలన రూపములును, తలఁపులు మాఱుటవలన అర్థములును మాఱును. కొన్నియెడల వాక్యములలో నుడులవాడుకలును మాఱును. ఇందు ధ్వనుల మార్పు మిక్కిలి ముఖ్యము. ఇట్లు భాషలు మాఱి, ఉపభాషలు-స్వతంత్ర భాషలు-భాషాకుటుంబములు పెక్కులు వెలసినవి.

భాషాకుటుంబములు

తొల్లింటివారు కొందఱు భాషను దేవతగా ఎన్నినారు. ఈదేవతయే సరస్వతి—పలుకువెలఁది. తొలుదొలుత భాషా దేవత ఒక్కరూపుననే ఒప్పిన ఒప్పుఁగాక! ఇప్పుడో పరమాత్మ పలురూపులు తాల్చునట్లు తానును పలురూపుల వెలయుచున్నది. పలుకువెలఁది తాల్చిన వివిధరూపములే ఆయాదేశములలో వాడు వేర్వేఱుభాషలు. వానిని భాషాశాస్త్రజ్ఞులు పరిశోధించి, కొన్నింటిలో ఉండు పోలికలను బట్టియు,ముఖ్యముగా వాని మిక్కిలితొల్లింటిరూపులపోలికలను బట్టియు, అవి ఒక్కవంగడములోనే చేరిన వని చెప్పఁగలుగు

చున్నారు. ఇట్లు ఏర్పడినవంగడములనే భాషాకుటుంబము లని
పేర్కొనుచున్నారు. ఒకభాషకు మఱొకభాషతో సంబంధము
కలదనుటకుఁ గాని, కొన్ని భాషలు ఒకభాషాకుటుంబమునకు
చెందిన వనుటకుఁ గాని అర్థ మే మన, అవి ఒకప్పుడు ఒకటే
భాషగా నున్న దాని యెడ తెగనిమార్పులయినను నానాఁటికి వేఱైన
వనుట యే— అనఁగా తొలిభాష ఒకచోట ఒకచందమునను-
మఱొకచోట మఱొకచందమునను పెంపొందఁగా ఏర్పడిన
వనుట యే.

తమ కున్న పోలికలనుబట్టి ఏర్పడినభాషా కుటుంబము
లలో మన భరతఖండమున ఎన్నికకు వచ్చునవి మూఁడు: ఉత్త
రమున ఆర్యభాషాకుటుంబము, దక్షిణమున ద్రావిడభాషా
కుటుంబము, ఈ రెండింటికిని నడుమ నున్నది * ముండాభాషా
కుటుంబము. ఇందు మొదటిది వడవంగడము, రెండవది తెన్వం
గడము, మూఁడవది నడివంగడము— అనఁదగు. ముండా
కుటుంబభాషలు మాటలాడువారు సుమారు ముప్పదిలక్షల
మంది యే కాని, అది అంత ముఖ్యము కాదు: తక్కినవి రెండే
ముఖ్యములు. సంస్కృతము, హిందీ మొదలగుభాషలు వడ

* దీనిని కొందఱు పండితులు కోల్వంగడమని వ్రాయుచు, అదే తగినదని
చెప్పుచున్నారు. ఇది నిజమునకు 'ఆస్ట్రిక్' పెన్వంగడములోని ఒకకుదురని
పెటరుష్మిట్ పండితమణి నిర్ణయించె. కోల్తెగవారే నిషాదు లని కొందఱ
తలంపు.

వంగడములోనివి. మన తెనుఁగును, దాని తోఁబుట్టువులును తెన్వంగడములోనివి. నవర, గదబభాషలు నడివంగడములో నివి. కాన, 'తల్లి సంస్కృతంబె యెల్లభాషలకును' అనుమాట అభిమానమునుబట్టి చెప్పినదే కాని నిజము కాద. నిజముగా సంస్కృతమే ఎల్ల భాషలకును తల్లిఅగునో భూమండలమున భాషాకుటుంబము ఒక్కటే ఉండవలసియుండును. కాని భాషా శాస్త్రజ్ఞుల పరిశోధనములవలన భాషాకుటుంబము లు పెక్కు లున్నట్లు తేలినది. అయినను, ద్రావిడభాషలు సంస్కృతము నుండియే పుట్టిన వని కొందఱందురు. "కాని అట్లు చెప్పవారు, ద్రావిడభాషలలో సంస్కృతభాగముకంటె తక్కిన (ద్రావిడ) భాగమే హెచ్చుగా ఉండుటయు, అంతకంటెను ముఖ్యాం శము—ద్రావిడభాషలలోని సర్వనామములు-సంఖ్యావాచక ములు-క్రియానామవాచకప్రత్యయములు-వాక్యములలోనిపద ములయేర్పాటు-ఇంతయేల, భాషకు ప్రాణ మని చెప్పనొప్పు ప్రతివిషయమునుకూడ మొదటినుండియున్నష్టముగాసంస్కృత మునకు భిన్నముగా ఉండుటయు చూడక, సంస్కృతపదములు హెచ్చుగా కనఁబడుటమాత్రము చూచి, అట్టితప్పసిద్ధాంత మునకు వచ్చి రనియు,అది నిశ్చయముగా తప్పే" అనియు కాల్డ్ వెల్ పండితుఁడు సమాధానము చెప్పె. అంతియకాక, ఏభాష నుగూర్చియేని పరిశోధించునపుడు దానిప్రాచీనస్థితి అందలిపద్య కావ్యములలోను, సేద్యకాండ్రమాటలలోను కానవచ్చు

ననియు, (ద్రావిడభాషలలో) రెండింటియందును సర్వనామములు-విభక్తి ప్రత్యయములు-క్రియావిశేషణములు-సముచ్చయములుమాత్రము గాక తక్కిన ప్రత్యయము లన్నియును-కలుపుముక్కలును కూడ ద్రావిడభాషలనాత్తే అనియు ఆయన తెలిపియున్నాఁడు. పై తప్పసిద్ధాంతమునకు హేతువు లక్షణ గ్రంథములు వ్రాసినవారు భాషాపరిశోధనము చేయమియో! మఱియేమో'

మఱొకమాట. "ద్రావిడభాషాకుటుంబము, ఇందవయూరోపియను భాషాకుటుంబమును, సిథియను భాషాకుటుంబమును కలుపుకొక్క మగుటయే కాక, కొన్ని ముఖ్యాంశములలో—అందు అన్నిటికంటె ముఖ్యముగా సర్వనామసందర్భములో—మానవభాషాచరిత్రమందు ఇం. యూ. భాషాదశకంటెను, సిథియనుభాషాదశకంటెను, అవి ఒండొంటిని విడిపోవునప్పటిదశకంటెను, ప్రాచీన మైన దని తలంచుటకు కారణము కానరాదా?" అనియైతము కాల్డ్వెల్ పండితుఁడు ప్రశ్నించియున్నాఁడు. దీనిసారాంశము పైని పేర్కొనిన భాషాకుటుంబములలో ద్రావిడభాషాకుటుంబము తక్కిన భాషాకుటుంబములకంటె తొల్లింటి దనుటయే.

ఒకభాష మఱొకభాషనుండి పుట్టిన దనుటకు ఒక దానిలోనినుడులు రెండవదానిలో ఉండుటమాత్రము ప్రబల కారణము కాఁజాల దని పైని తెలిపినదానిని బట్టి తెలియ

వచ్చును. ఆపదము లైనను తల్లిభాష అనుదానిలో
మాత్ర ముండునంతనే అవి మొదటినుండియు దానిలోనే
ఉండిన వనుటకు వీలు లేదు. నిజముగా అవి అట్టివే అగునో
దానియందే కాక దానితోబుట్టువులగు భాషలలో కూడ
ఉండవలెను. అట్టి ఆధారము లేనిచో తల్లి భాష అనునది పిల్ల
భాష కావలసివచ్చును. పరిశోధకులు సంస్కృతపదము
లనుకొనువానిలో కొన్ని-మీనాదికములు-ద్రావిడపదముల
నుండి ఏర్పడిన వని నిఘంటువులలో పండితులు జాబితా లిచ్చి
యున్నారు. సంస్కృతమున ప్రాకృతపదములు, అరబ్బీపద
ములు, గ్రీకుపదములు చేరగా ద్రావిడపదములు చేరుట
వింత కారాదు.

పైని తెలిపినదానినిబట్టి అభిమాన పక్షపాతములకు
లోనుగాని భాషాపరిశోధకులగు పాశ్చాత్యపండితులు ఉత్తర
దేశభాషలవలె ద్రావిడభాషలు సంస్కృతభవములు కాక
ప్రత్యేకకుటుంబమునకు చెందిన వని చేసిననిర్ణయము నిజ మని
కైకొనదగు. మన తెనుగు ఆర్యభాషా కుటుంబమునకు
చెందిన దనిన గౌరవము హెచ్చు ననికాని, ద్రావిడభాషా
కుటుంబమునకు చెందిన దన గౌరవము తగ్గు ననికాని అను
కొనరాదు. మనకు కావలసినది నిజము; తరువాత తల్లి
భాషమీద అభిమానము. అట్టి అభిమానముతోనే రాజ
రాజనరేంద్రాదులు గ్రంథములు వ్రాయించినారు: తిక్కనా

దులను అట్టి అభిమానముతోనే గ్రంథములు వ్రాసినారు. తెనుఁగునకు పేరు తెచ్చినారు. వారికంటె భాషాపరిశోధనమునకు సదుపాయములు మనకు హెచ్చు. ఇప్పటిసదుపాయములనుబట్టి పరిశోధన మొనర్చి, తెనుఁగువ్యాకరణముల లోని అంశములు పరీక్షించి, ప్రమాదములు తొలఁగింపవలయు; వలయు క్రొత్త అంశములు చేర్పవలయు, వీలగునంత వఱకు కొఱంత లేనిదిగా చేయవలయు. కొఱంతలతో కూడినది సరిగా శాస్త్రమనిపించుకొనుటకు తగదు. శాస్త్రమునకు పరిశోధనము ప్రధానసాధనము; సత్యము ప్రాణము; ఇవి రెండును కొఱవడిన శాస్త్రము నేతిబీఱకాయవంటి దగును. పరిశోధించినకొలఁదియు తెనుఁగు తెన్వంగడములోనిదే అను తలంపు బలపడుచున్నదిగాని, ఆంధ్రవాఙ్మయచరిత్రమున నుడివినట్లు మహారాష్ట్రమువలె ప్రాకృతమో - ప్రాకృతభవమో - అను తలంపు కలుగుటలేదు. అట్లే ఈ నడుమను ఇండో-ఇరానియన్ కాలమునుండియు వచ్చుచుండిన ప్రాకృతమునుండి ద్రావిడభాషలు పుట్టెనని మానెయ్యురు డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు వెలువఱుపఁదొడఁగిన వాదమును మదికి నచ్చుటకు తగినంతపస కలదికాదు అయినను ఆయన తెలిపినటులు నిజ మరయువారికి హెచ్చరిక కలిగించుటకు అది ఎంతయు తోడ్పడుచు. డాక్టరుగారు తమవాదము నిలువఁబెట్టుకొనుటకు ప్రయత్నించుటలో చరిత్రకు ఈయ

వలసిన ప్రాముఖ్య మిచ్చుట మఱచి, తప్పుదారి పట్టినారు. ౮౦ ఏండ్ల క్రిందటి కాల్డ్‌వెల్ బిషప్పుగారు తప్పుదారి పట్టినట్లు ఆక్షేపించినవీరు ఇప్పుడు ఇటు చేయుట ఎంతయు వింతయే! ఇండో-ఇరానియన్ భాష ఎప్పటిది? తొలిద్రావిడ భాష ఎప్పటిది? మార్చుటకు ఎంత యత్నించినను చరిత్ర మాఱునా?

ద్రావిడులు ఆర్యులకంటెముందే ఇండియాలో ఉండినట్లు చరిత్ర ఎలుఁగెత్తి చాటుచున్నది. అగయికలు అది నిజమే అని తెలుపుచున్నవి. మేలెంకవ్రాతలును చరిత్ర పరిశోధనములను బలపఱుచుచున్నవి ఇట్టివో, "ఆర్యులకంటెముందే ఇరానియనులు కొందఱు ఇండియాకు వచ్చిరి, దర్దిక్ భాషలు-పైశాచీ ప్రాకృతములు—మాటలాడువారు ఆ ఇరానియనుల సంతతివారు, ద్రావిడ భాషలనబడునవి ఆ పైశాచీ ప్రాకృతములనుండి పుట్టినవేకాని ప్రత్యేకభాషాకుటుంబమునకు చెందినవికావు" అని తలపోయుట పగటికల! ద్రావిడులను ప్రత్యేకజాతివారు లేరు అనుట పచ్చితెగువ!! వీనిప్రాపున క్రొత్తసిద్ధాంతము అల్లుఁజూచుట గాలిలో మేడకట్టుట!!!

తెవ్వంగడము

(ద్రావిడభాషాకుటుంబములో వాఙ్మయములు కలవగుటచే ముఖ్యములని ఎన్నిక కాంచుభాషలు—తెనుఁగు, తమిళము, కన్నడము, మలయాళము.) భరత ఖండమునందలి దక్షిణభాగమున వాడుకలో ఉండుకతమున వానిని దక్షిణ

దేశభాష లనియు పేర్కొనుచున్నారు. దక్షిణదేశ మనఁగా
సాధారణముగా వింధ్యమునకు దక్షిణభాగమే లెక్కకు వచ్చు
ను. పైని తెలిపిన ముఖ్యభాషలే కైకొన్నచో అది సరిగానే
ఉండును. కాని తెన్వంగడములోనివి ఆనాలుగు భాషలే కావు.
వానితోపాటు తుళు, కుడగు, తోడ, కోట, గోండి, కోఁదు,
కురుఖు, మల్తో, కోలామి, బ్రాహుఇ—అను మఱి పదిభాష
లు కలవు. వీనిలో మొదటినాలుగును దక్షిణదేశములోనివే.
ఐదవదగు గోండి కొంతవఱకు దక్షిణదేశములోనిదైనను
కొంతవఱకు ఉత్తరదేశపుది కాకతప్పదు. భరతఖండమును
ఉత్తర దక్షిణభాగములుగా భాగించుచో సూరత్తు,
నాగపురము, కటకము - అను పట్టణములు దక్షిణపు
ఎల్లమీఁద ఇంచుమించుగా ఉండును. ఈయెల్లగీఁతనుబట్టి
ఆఱవదగు కోఁదు కటకమునకు దగ్గఱగా పడమటను కొంత
దక్షిణముననను, కొంత ఉత్తరముననను ఉండును. కోఁదు మాట
లాడు దేశమునకు ఉత్తరముగా గయవఱకును వాడుకలో
ఉన్నకురుఖును, గంగకు దక్షిణతీరమున మూర్షదాబాదుపట్ట
ణమునకు కొంతదూరమున పడమటను-వాయవ్యముననను వా
డెడి మల్తోయును ఉత్తరదేశభాషలే అని వేఱుగా చెప్పనక్క
ఱలేదు కదా! మధ్యరాష్ట్రములోని అమరావతీ పట్టణము
నకు ఈశాన్యభాగమున వాడుచున్న కోలామీయును ఉత్తర
దేశభాషయే. ఇందువలన గోండి, కోఁదు, కురుఖు, మల్తో,
కోలామీ అను ౫ భాషలు ఉత్తరదేశభాషలుగా లెక్కకు

వచ్చెను. ఇరువదవశతాబ్దియందే కొన్ని ద్రావిడభాషలు ఉత్తరదేశభాషలుగా ఉన్నప్పుడు శతాబ్దుల లెక్కరానినాఁటికి మదిచూపు మరల్చి పరికించుచో అప్పటిస్థితి ఎట్లుండునో! కనుఁగొందము. ఔరా! ఏమి యీవింత? ఉత్తరదేశమంతయు ద్రావిడుల మనికిపట్టే! ఎక్కడ వినవచ్చినను ద్రావిడ భాషయే! ఇప్పు డార్యభాష లనువాని వాసనయే ఎక్కడను కానరాదు. దస్యులతో పోరి తుదకు వారిని ఓడించి వారి దేశ మార్యు లాక్రమించుకొనినపిదపఁగదా ఉత్తర దేశ మార్యావర్తమైనది' అయిన దస్యులేమైరి? ఎక్కడకు పోయిరి? ఇప్పుడు వారిసంతతివా రెవరు? వీనికి సమాధానములు కానరావు. కావున దస్యులే ద్రావిడు లైరి అని తలంపనగు. ఇందువలన, భరతఖండ మంతయు తొలుత ద్రావిడ దేశమే, ద్రావిడభాషయే అపుడు భరతఖండభాష అని తోఁచును. కాదందురా ఎవరేని? అయిన ఆర్యభాషలగు ప్రాకృతములలోని అచ్చపు దేశ్యములు ఏభాషలోనివి? అవి ద్రావిడపదము లనియే చెప్పవలయునుగాని మఱొకతెఱంగున చెప్పవీ లగునా? కాఁబట్టి సరిగా పరికించినచో మొదట ఉత్తరదేశభాష ద్రావిడభాష అనియే తేలును. దీనికి ఇపుడు కూడ బలుచిస్థానమున దానికి రాజధాని అగు క్వెట్టాపట్టణ సమీపమున వాడుకగు నున్న బ్రాహూఈ అను ద్రావిడభాషయే ప్రబలమగు తార్కాణ. సింధుదేశమున 'మొహంజో

దారో' యును, పంజాబున 'హారెప్ప'(హారియూపియా) యును బయల్పడిన వెనుక, ఆ రెండు దేశములలోను-సింధుతీరమున ద్రావిడులు, సుమారు ౫ వేల యేండ్ల క్రిందట ఆర్యులు భరతఖండమున ప్రవేశింపకముందే, ఎంతో నాగరికులై ఉండియుందురని సర్ జాన్ మార్షల్ పండితుడు తలంచుచున్నాడు. పంజాబులో రావీ (పరుష్ణీ) నదీతీరమున కృష్ణవర్ణులు, ఆర్యేతరులు ఉండినట్లును, వారిని సుదాసుడు గెల్చినట్లును, ఇంకను పలుచోట్ల వారు ఉండినట్లును ఋగ్వేదమే చెప్పుచున్నది. ఆ ఆర్యేతరకృష్ణవర్ణులు ద్రావిడులే అని 'సీక్రెట్ డాక్ట్రిన్' చాటుచున్నది. సంయుక్తరాష్ట్రములలోని ఒక జిల్లాపేరగు 'గోండా' నుడి, మునుపు అక్కడ ఉండినట్లు గట్టిసాక్ష్య మిచ్చుచున్నది. ద్రావిడభాష అగు గోండీ ఇప్పటికిని రాజపుతానావఱకును వ్యాపించియున్నది. మల్తో అను మఱొక ద్రావిడభాష బీహారులో పాట్నాదగ్గఱ గంగా తీరమున ఇప్పుడు వాడుకలో ఉన్నది. బంగాళములోను, ఒరిస్సాలోను మునుపు ద్రావిడభాషలు వాడుచుండినటులు సునీతికుమార చట్టర్జీ, విజయచంద్రమజుందారుపండితుల గ్రంథములు తెలుపుచున్నవి. కావున, ఆర్యులు రాకమునుపు భరతఖండములో, పడమటను—బలూచిస్థానమునను, సింధుదేశములోను, ఉత్తరమున—పంజాబులోను, సంయుక్తరాష్ట్రములలోను, తూర్పున—ఒరిస్సా-బంగాళములలోను, నడుమను—బీహారు, మధ్య

రాష్ట్రములలోను, దక్షిణమున — కళింగములోను, తెనుఁగు నాటిలోను, కర్నాటిలోను, తుళు-కుడగు-తమిళనాడులలోను, మలయాళములోను ద్రావిడులే హెచ్చుగా ఉండినట్లు తేలును కదా? అట్టిచో భరతఖండపు తొలిభాష కాక, మఱి ఏది కాఁగలదు? నిజము ఇటులుండ, భరతఖండపు మొదటిభాష సంస్కృత మనియు, దానినుండి ప్రాకృతమును, † సంస్కృత ప్రాకృతములనుండి తెనుఁగును పుట్టిన దని తలంచువారును, వాదించువారును తమతలంపు వట్టిభ్రమ అని ఇప్పుడైనగుర్తించి, తప్పుదారి వదలి, సరిఅగు దారి పట్టుదురుగాక! తెనుఁగువారు తమ పలుకుతల్లిని మన్నించి కొలిచి మేలివాఙ్మయము సమకూర్చి, తాము మేలొంది, పైవారికి మేలు చేకూర్తురుగాక!

ఇప్పుడు ముఖ్యద్రావిడభాషలకు ద˘ణమే మనికిపట్టగుటచే వానివంగడము తెన్వంగడము కావలసివచ్చినది.

తెనుఁగుతోఁబుట్టువులగు ౧౩ పలుకులలో తమిళము (అఱవము), కన్నడము, మలయాళము, కోఁద, కోయ (గోండి)—అను పేర్లు మనవారికి కొందఱకైన తెలియును. కాని తక్కినవాని పే ర్లయినను పలువురు వినియుండరు. దీనికి

† సంస్కృత ప్రాకృతములను గూర్చి హెచ్చుగా ముచ్చటించుటకు ఇది తగినచోటుగాదు. వానిని గూర్చి 'తెనుఁగు-తోడులు' అను వ్రాయికలో తెలుపుదును.

వింతపడ నక్కఱ లేదు. ఇపుడు ప్రమాణములుగా ఉన్న తెనుఁగువ్యాకరణములు వ్రాసినపండితులుకూడ—చిన్నయసూరిగారుసైతము—తెనుఁగుతోఁబుట్టువులలో ముఖ్యములగు భాషల పేరైనను మచ్చునకైనను ఎత్తకుండుట వింతలలో వింత! తెలిసి ఎత్తరైరో తెలియక ఎత్తరైరో, దేవునికే ఎఱుక! ఒక వంగడములోని ముఖ్యభాషలలోనైనను కృషి చేసినఁగాని అందలి యేభాషయేని సరిగా తెలిసికొనఁగలుగుట కాని, దానిలోని సొగసులు గ్రహించి ఆనందింపఁగలుగుట కాని కలలోనివార్త అట్టిదో ఆలక్షణము తెన్వంగడపుబాసలకు పట్టకపోదుకదా! పైదేశపువాఁడైనను కాల్డ్‌వెల్ పండితుఁడు తెన్వంగడపు ముఖ్యభాషలకృషి అత్యావశ్యక మని తెలుపుటయేకాక వీలగునంతవఱకు తా నట్టికృషి చేసి, అట్టికృషి ద్రావిడభాషలు మాటలాడువారు సరిగా చేసినయెడల దాని వలన చదువఁదగునదియు, మన్నింపఁదగునదియు, పనికివచ్చునదియు అగు మంచి ద్రావిడవాఙ్మయము—ఎంతో తెలివికలవార లగు దక్షిణదేశస్థుల తెలివికి తగిన చక్కని మేలిశైలిని, నుడుల బడబడగాని మోటుతనముగాని, లేక, మంచివిషయముతోను-మంచిపాకముతోను-మంచితలంపులతోను వ్రాయఁగా వన్నెకెక్కు ద్రావిడవాఙ్మయము — పెంపొందు ననికూడ ఆశించె! కాని మన దురదృష్టముచే ఆ ద్రావిడభాషాభిమాని ఆశపడి సుమారు ౮౦ ఏండ్లయినను ఇప్పటికిని అది ఫలింప

లేదు! ఎట్లు ఫలించును? అందులకు తగినటులు తెన్వంగడపు ముఖ్యభాషలలో నైనను కృషి చేసినవా రెవరు? వ్రాసిన వా రెవరు? ఎవరును కానరారు తెలిసినంతవఱకు! అట్టి కృషియే లేనిచో దాని ఫలముగా ఉండవలయు మంచిలక్షణ ములతో వెలయు మేలి వాఙ్మయము బయలువెడలు టెట్లు? అయినను కడచినదానికి వగచిన లాభ మేమి? ఇప్పుడైన మన మేలుకొఱకు మనభాషలలో కృషిచేసి, ద్రావిడభాషల పోలిక వ్యాకరణము వ్రాసి తనజీవితమును ధారపోసిన కాల్డు వెల్ పండితుఁడు "విదేశస్థులు తమభాషను గూర్చియు, తమ వాఙ్మయమును గూర్చియు, తమతొల్లింటి విషయములను గూర్చియు తీసికొను శ్రద్ధ స్వదేశస్థులలో సద్భావముతోను, స్నేహభావముతోను కూడిన స్పర్ధను కొంచెమైనను కలిగింపకపోదని నమ్ముచున్నాను" అని తెలిపిన సత్సంకల్పబలముచే నైన ఆయన ఆసించినటులు తెన్వంగడపు మేలిబాసలను మన్నించువారు పనిచేయుటకు కడంగుదురుగాక! ఆయన తెలిపిన గుణములతో విలసిల్లు మేలివాఙ్మయమును వెల్లడింతురుగాక!

## తెగలు

(తెన్వంగడములోని తెగలును, వానిలో ఒండొంటి పొత్తును తెలుపుటకు తగినట్లు ముఖ్యములుగా కైకొనిన పదు

నాలుగుభాషలను ఈచందమున వంశవృక్షముగా గ్రీర్సన్ పండితుఁడు కూర్చియున్నాఁడు.)

పై వంశవృక్షమునుబట్టి తెన్వాంగడము మొదటిమూఁడు తెగలుగా చీలినది. అందు మొదటి తెగ ౨ కోవ లయినది, రెండవది ౨ కోవ లయినది; మూఁడవదానికి కోవలు లేవు.

మొదటి తెగలోని తొలికోవ ౪ చిఱుకోవ లయినది. అందు మొదటి చిఱుకోవ ౨ కుదుళ్ళయినది. తొలి కుదుటి భాష తమిళము; రెండవకుదుటిభాష మలయాళము. రెండవ చిఱుకోవభాష తుళు. మూఁడవ చిఱుకోవభాష కుడగు. నాల్గవ చిఱుకోవ ౨ కుదుళ్ళయినది; మొదటిదానిలోనివే తోడ, కోట - అనుభాషలు. రెండవకుదుటిభాషయే కన్నడము. ఇఁక రెండవకోవ ౨ చిఱుకోవ లయినది; మొదటి చిఱుకోవభాష కురుఖు; రెండవచిఱుకోవభాష మల్తో. కాన మొదటితెగలోని మొత్తముభాషలు ౬.

మొదటితెగభాషలకును, రెండవతెగభాషలకును నడుమను కొక్కెములుగా ఉన్నభాషలు గోండి, కోఁదు.

రెండవతెగలోని తొలికోవభాష కోలామి; రెండవ కోవభాష మన తెనుఁగు

మూఁడవ తెగలోని భాష ఒక్క బ్రాహూఈ మాత్రమే.

ఇప్పటికి తెన్వంగడపు తెగ లేవో, వానితో సంబంధించినభాష లేవో, వాని కొండొంటికి ఉన్న పొత్తు ఎట్టిదో తెలియవచ్చినది. కాన ఇఁక వీనిలో ఒక్కొకభాషనుగూర్చి మఱికొంత తెలిసికొన యత్నింతము. వంగడములోని మూఁడు తెగలలో మూఁడవది అంత ముఖ్యము కాదు. కాన మొదట దానితో సంబంధించిన బ్రాహూఈభాషనుగూర్చి తలిసికొని, పిదప తక్కిన భాషలనుగూర్చి తెలిసికొనఁదగును.

తెగ 3—బ్రాహూఈ (౧౪) —

బ్రాహూఈ ఇపుడు అముఖ్యమగు భాష అగుటకు కారణము, అది మూఁడవతెగలో నిలిచియుండి తెన్వంగడపు బాసలలో ఒకటిగా లెక్కకు వచ్చినను- చిరకాలముక్రిందటనే తక్కినతెగలభాషలనుండి విడిపోయి, పేరునకుమాత్రము విడిభాషగా ఉండుటయే.

ఈభాష తూర్పుబలూచిస్థానపుపర్వతప్రదేశములలోను, వానికి దగ్గఱగా, ఉన్న సింధుదేశపుజిల్లాలలోను నివసించు బ్రాహూఈలు ౧,౬౫,౫౦౦ మంది (౧౯౨౧లోని భాషల సర్వేఅంచనానుబట్టి) మాట లాడుదురఁట. కొండలలో ఉండువారు చిన్నచిన్న తెగలుగా విడిపోయియుందురు. సరవన్ - ఝలవన్ రాష్ట్రములలోను, ఆగ్నేయభాగమునను ఉండువారుమాత్రము తూమాను లనుపెద్దపెద్దడేరా గ్రామములలో

నివసింతురు. వారు తామే బలూచిస్థానములో ఆదిమనివా సుల మని నిస్సందేహముగా చెప్పుదురు. ఇందువలన తొలుత బలూచిస్థానముకూడ ద్రావిడభాషకు మనికిపట్టని తలంప నగును.

బ్రాహుఈకి బిరాహుఈ రూపాంతరము. సింధు దేశ మున బిరూహీ, బిరోహీ, బ్రోహ్యా - అనుపేరులును వాడు దురు. దీనికి కూర్‌గాల్లీ అను మఱొకపేరుకూడ కలదఁట. ఈపేర్ల అర్థ మేమో తెలియదు.

ఈభాషలో వ్రాఁతవాఙ్మయ మేమియులేదు. ఇది వ్రాయుటకు పారసీకవర్ణమాలిక ఇపుడు వాడుచున్నారు. అక్ష రములు సాధారణముగా హిందూస్థానిలోవానివలెనే పలుకు దురు. ఇది చిరకాలముక్రిందటనే తన తోఁబుట్టువులనుండి విడిపోయి పరభాషలనడుమ నుండుటచే విదేశమున ఒంట రిగా ఉన్న మానిసిగతి దీనికి పట్టినది. అందుచే పరభాషాపద రూపములును, పదములును దీనిలో హెచ్చుగా చేరి ఇది ఇపుడు సంకరభాషగా మాఱినది. అయినను తెన్వంగడపు భాషలలో కానవచ్చునియమములును, కొన్ని ముఖ్యము లగు నుడులును ఇందు కనఁబడుటచే ఇదియు ద్రావిడభాషయే అని గుర్తింప వీలు కలుగుచున్నది. దీనికి తనతోఁబుట్టువులలో కురుఖుమల్తోలతోడిపోలిక హెచ్చు. కురుఖులోవలెనే దీనిలో సైతము ఒత్తువ్రాలు ఎక్కువగా వాడుదురు. దీనియందు

ఇపుడు ఉన్నంతవఱకైనను తెన్వంగడపుచిన్నెలు కానవచ్చుట యింతయే.

తెన్వంగడపుచిన్నెలు

౧. ఎ ఒ—లనుప్రాసాలు ఉండుట.

౨. తుదిహల్లునకు హ్రస్వాచ్చుధ్వని ఉండుట; అది తఱుచుగా 'ఎ'; ఒకచోఁ 'ఉ.' ఉదా. నన్, ననె=మేము; నుమ్ నుము= మీరు, ఇది సింధుదేశమున హెచ్చు.

3.'హ'లోపించుట. ఉదా. హంత్, అంత్ =ఏమి?

౪. 'క్' బహువచనప్రత్యయముగా ఉండుట. గోండిలో బ. వ. ప్ర. 'క్'.

౫.తృతీయావిభక్తిప్రత్యయము 'అట్'. తెనుఁగున 'టన్'. ఉదా. బ్రా. ఖల్-అట్; తె, కంటన్= కంటితో.

౬. సప్తమీవిభక్తిప్రత్యయము 'టీ' తెనుఁగున 'టి'. ఉదా. బ్రా. ఖల్-టీ; తె. కంటియందు.

౭. విశేషణములు లింగవచనవిభక్తులకొఱకు మాఱకుండుట; నామవాచకములముందు వచ్చుట.

౮. సంఖ్యార్థకములు. ఇరట్; తమిళమున ఇరణ్డు= రెండు. ముసిట్; తుళుభాషలో, మూజి=మూఁడు.

౯. సర్వనామములు. నీ; తమిళమున, మలయాళమున'నీ'; కన్నడమున 'నీను'; కురుఖులోను, మల్తోలోను

'నీన్'=నీవు . తేనె, తమిళమున 'తాన్'=తాను. ఓడె= వానికి, తె. తె. వాడికి. (గ్రా)

౧౦. క్రియలు. ఉట్=ఉన్నాను, ఉన్=ఉన్నాము; కుక్=కుడుచు (తిను); ఖనా=కనెను (చూచెను); ఖనిట్= కంటివి. బిన్=వినుు. మన్=మను (ఉండు).

బాహూకీమచ్చు

ఎంఏఘ్-అప్-ఎ ఇరా మార్ అప్నర్ ఓ తెనా కటి ఆ-ఎ ఓ ప్తి-తో బక్ఖ్-కరె

ఒకమనుష్యునికి ఇరువురు కుమారులు ఉండిరి వాఁడు తన ఆస్తిని వారితో పంచుకొనెను

ఓ బావహ్, ఈ ఖుదా నా ఓ నా వెూఁ-కే ముల్లామత్ ఉట్ వామార్ బస్నేనే.

ఓ బాబూ, నేను దేవునియొక్కయు మఱి నీయొక్కయు మంచిట నిందకుఁడను (ఐ) ఉన్నాను. నీకొడుకు వచ్చెను

తెగలు ౧-౨

ఈ రెండు తెగలే తెన్వంగడమున ముఖ్యములు. ముఖ్య భాషలును వీనియందే కలవు. తమిళము, కన్నడము, మల యాళము మొదటితెగలోనివి. తెనుఁగు రెండవ తెగలోనిది. ముఖ్యభాషల నెుత్తమునుకుమారిలభట్టు 'ఆంధ్రద్రావిడభాష' అని పేర్కొనె. ఆంధ్రపదము తెనుఁగును, ద్రావిడపదము తమి ళమును తెలుపును. తమిళము ముఖ్య మగుటచే కన్నడమును

దానితో చేరినదిగానే కైకొని యుండవచ్చును. నిజమునకు తెనుఁగు కన్నడములకు ఉన్న సంబంధముకంటె కన్నడతమిళములకు ఉన్నసంబంధము హెచ్చగుట స్పష్టమే. కాన నాఁటికి కన్నడము తమిళమునకు ఉపభాషగానే ఉండెనేమో! ఇఁక మలయాళ మన్ననో అప్పటికి తమిళమునకు ఉపభాషయే కాని ప్రత్యేకభాష కాదయ్యె. కావున 'ఆంధ్రద్రావిడభాష' ఇపుడు తెన్నంగడములోని ముఖ్యభాషలుగా ఎన్నిక కాంచు నాల్గింటిని తెలుపునదే అగును.

తోఁబుట్టువులగు తెనుఁగు తమిళకన్నడములలో ఒకటి మఱొకదానితల్లి అని వ్రాయువ్రాఁతలు సంస్కృతప్రాకృతములు తెనుఁగునకు తల్లి అని వ్రాసినవ్రాఁతకు తోఁబుట్టువులే—అని తలంపఁదగినవే.

ఇఁక తొలితెగలోనిభాషలను గూర్చి కొంత ముచ్చటించుకొందము. అందు ముఖ్యభాషలను మూఁదు కైకొందము.

౧. తమిళము

సాధారణముగా తెన్నంగడపు తొలిబాస జాడలు మిక్కిలి హెచ్చుగా కానవచ్చుభాష తమిళమే అని పలువురు తలంచుచున్నారు. కాని తెనుఁగు మొదలగు భాషలు తమిళపురూపులకంటె వింతలగు పెక్కుపాఁతరూపులు కలిగి దానికంటె తొల్లింటిస్థితిని తెలుపు చుండుటచే, పైతలంపు

నిజము కాదని తేలును. కాఁబట్టి తమిళము తక్కినతోఁబుట్టువులకంటె తొల్లింటి దనుటకంటె, అదియు తక్కినవానివంటి దనుటయే తగును. అయినను తెన్వంగడపు సామాన్య నియమములను తక్కినవానికంటె హెచ్చుపట్టుదలతో పాటించుట తమిళములోని విశేష మని చెప్పక తప్పదు. ద్రమిళ ద్రవిడపదములు తమిళనుడినిపట్టి ఏర్పడినరూపము లని కొంద ఱందురు. 'తమిళ్' నుడికి 'తియ్యఁదనము' అను అర్థము కలదు. 'చలవగలవోటు' అని విద్వాన్ నరసింగరావు వ్యుత్పత్తి చెప్పిరి. తమిళమును తెనుఁగువారును, కన్నడపువారును 'అఱవము' అందురు; దీనిని కన్నడిగలు 'తిగళర్' 'తిగుళర్' అనియు వాడుదురు. ౧౯౦౧ జనాభా లెక్కనుబట్టి ఇది ౧,౭౦,౯౮,౯౦౧ మంది మాటలాడు చుండినట్లు తెలియవచ్చెను.

మాటలాడు జనులసంఖ్యనుబట్టి తెన్వంగడపుభాషలలో తమిళము రెండవది. భరతఖండపుదక్షిణదిక్కున చెన్నపట్టణమునకు కొంచెముపైనుండి కన్యాకుమారివఱకును ఉన్నభాగములో మైసూరుసంస్థానపు దక్షిణభాగమును, మలయాళమును కాక మిగిలిన తూర్పువైపుప్రదేశ మంతయును, సింహళద్వీపములోని ఉత్తరపునగమును తమిళమునకు మనికిపట్టులు. దీనికి ఉత్తరమున తెనుఁగును, పడమట కన్నడమును - మలయాళమును మాటలాడుదురు.

## ఉపభాషలు

### శెంతమిళము

వాఙ్మయముఁగల తక్కిన భాషలలోవలెనే తమిళములోను మాటలాడుభాషయు, వాఙ్మయభాషయు కొంతవఱకు మాఱియుండును. గ్రంథములలో వాడు తమిళమునకు 'శెందమిళము' అని పేరు. 'కుఱళ్' మొదలగువానిలో వాడినభాష ఇదే. తొలిగ్రంథములలోని భాష వ్యాఖ్యానములసాయముతో సైతము చదువుకొనినవారికికూడ సరిగా తెలిసికొనుట కష్టముగా ఉండు ననిన తక్కినవారిమాట చెప్పవలసిన దేమున్నది? 'తొల్-కాప్పియమ్' బోధపడుట దుష్కర మగుటచే దానితరువాత వ్రాసిన నన్నూలే ముఖ్యముగా వాడుదురు. అదియు పండితులకే కాని తక్కిన వారికి సరిగా బోధపడదు. (తమిళములోని తొల్లింటి గ్రంథములభాష ఎట్లుండునో తెలిసికొనవలె నని తెనుఁగునాట నున్న తమిళము తెలిసిన నామిత్రులలో ఒకరిని అడుగఁగా, ఆయన వానిలోనిభాష—శెంతమిళము—బోధపడ దని తెలిపిరి. పిదప దైవికముగా దేశసేవలో చెఱసాలలలో కొంతకాలము నివసించుట తటస్థించె. అందు వెల్లూరి చెఱసాలలో ఉన్నపుడు తిరునల్వేలి నివాసులును, పట్టభద్రులును, తమిళవాఙ్మయముపై విమర్శనములు వ్రాయుసామర్థ్యము కలవారును అగు శ్రీయుత తిరుకూట సుందరము

పిళ్లైగారితో దైవానుగ్రహమున నాకు స్నేహము కలిగినది. అచ్చటనే మఱొక తమిళ నెచ్చెలియు, మధురనివాసులును అగు శ్రీయుత వైద్యనాథఅయ్యరుగారి దగ్గఱ 'శిలప్పదిగారమ్' అను తమిళకావ్యము లభింపఁగా నా తొలితమిళనెచ్చెలిని వేఁడి, అందు కొంత ఆయనచే చదివించి వింటిని. ఆయన టిప్పణవ్యాఖ్యానముల సాయముతో అర్థము చెప్పెడివారు; అయినను ఒక్కొక్కచోట్టున సరిగా అర్థ మయ్యెడిది కాదు. అపుడు 'శెన్-తమిళము' ఎట్టిదో అనుభవమువలన నాకు బోధపడినది.) కాన గ్రంథములలోని తమిళము ఒక ఉపభాషగా కైకొనఁదగు. అంతే కాదు. ఇది శాశ్వతముగా ఉండవలసిన ఉపభాషయే. తెనుఁగున మంచి పాండిత్యము సంపాదింపఁగోరువారు ముఖ్యముగా చదువవలసినదికూడ ఈ శెన్-తమిళమే.

### కొడున్-తమిళము

మాటలాడుతమిళమును కొడున్-తమిళ మిందురు. ఇదియు అంతటను ఒకటేరూపున ఉండదు. తమిళనాటను ఉత్తరమున మాటలాడుదానికిని దక్షిణమున మాటలాడుదానికిని పలుకుబడి మొదలగు విషయములలో కొంత భేద ముండును; ఇదియును తెలిసికొనవలసినదే.

మునుపు మలయాళము తమిళమునకు ఉపభాషగా ఉండినను, అది ఇపుడు విడిభాషగానే వెలయుచున్నది.

## ఇరుల-కసువ

ఇరుల ౧౮౯౧-వ సం. జనాభాలెక్కలనుబట్టి నీలగిరులలో ౧౧౯౬ గురును, కోయంబత్తూరుజిల్లాలో ౩౭౭ గురును, కడపజిల్లాలో ౩౨ మందియు, సేలముజిల్లాలో ౮ గురును, ఉత్తరార్కాటుజిల్లాలో ఒక్కడును మొత్తము ౧౬౧౪ గురు మాటలాడుచుండినట్లు తెలియవచ్చును. కాని ౧౯౦౧ సం. జనాభాలెక్కలనుబట్టి నీలగిరులలో ౮౧౯ గురును, కోయంబత్తూరుజిల్లాలో ౧౦౬ గురును, ఉత్తరార్కాటుజిల్లాలో ౭ గురును, మొత్తము ౯౩౨ మంది మాత్రము మాటలాడుచుండినట్లు తేలినది.

ఇరులనిఘంటువులు చిన్నవి రెండు అచ్చుపడినట్లు తెలియవచ్చుచున్నది. ఇరులబాస తమిళమునకు ఉపభాషగా కైకొనినారు.

కసువబాసయు తమిళమునకు ఉపభాష అనియే కొంద అందురు; కాని కొందఱు కాదేమో అని అనుమానించుచున్నారట. ౧౮౯౧-వ సం. జనాభాలెక్కలనుబట్టి నీలగిరులకును మొయారునదికిని నడుమను ౩౧౬ కసువ మాటలాడుచుండిరి. కాని ౧౯౦౧-వ సం. జనాభాలెక్కలనుబట్టి ఆసంఖ్య ౨౪౧ కి దిగినది.

కోఁఅవ

ఇపుడు తమిళమునకు ఉపభాషగా కైకొనిన యీకోఁఅవ (ఎఱుకుల) భాష కొన్నియెడల ప్రత్యేకభాష అని తలంచిరి. కాని ఇది ఇప్పటివాడుకతమిళమునుండి పుట్టినది కాకున్నను ప్రత్యేకభాషమాత్రము కాదు. పెక్కువిషయములలో దీనికిని తమిళమునకును భేదమును, తక్కిన తెన్వంగడపుబాసలతో పోలికయు కలదు. అయినను మొత్తముమీఁద దీని యేర్పాటు తమిళములోనిదానివలెనే ఉండును.

కోఁఅవబాస మాటలాడువారు మైసూరుసంస్థానములోను, చెన్నరాష్ట్రములోను తమ్ము కోఁఱ, కుఱ్ఱు, కోఁఅవ, కోఁఅచ, కులువరు అను పేర్లతో పిలుచుకొందురు. తెనుఁగువారు కోఁఅవలను ఎఱుకులవాండ్రందురు. బెల్గాములో వీరిభాషను కోర్చరీ, కోర్వీ అను పేర్లతో వాడుదురు; బీజపురములో 'కోర్వారు' అందురు; కొల్హాపురములోను, దక్షిణపు మరాఠాజాగీరులలోను 'కోర్వీ' అందురు; ఈపేర్లు ఎట్లు పుట్టెనో తెలియదఁట. ఇట్టిజాతివారిని కుడగు దేశమున కొడగులనియు, బంగాళరాష్ట్రమున కురుఖు లనియు పిలుతురఁట.

కోఁఅవలు చెన్నరాష్ట్రమందే కాక, నైజాము రాష్ట్రమునను, బొంబాయిరాష్ట్రమునను, మైసూరుసంస్థానమునను, కుడగు దేశమునను కూడ ఉన్నట్లు ౧౯౦౧-వ సం. జనాభా లెక్కలనుబట్టి తెలియవచ్చుచున్నది.

| | |
|---|---|
| చెన్నరాష్ట్రమున | ౪౦,౬౦౬-గురు |
| నైజామురాష్ట్రమున | ౬,౯౨౧- రు |
| మైసూరుసంస్థానమున | ౨,౫౯౧- రు |
| బొంబాయిరాష్ట్రమున | ౨,౪౯౦-మంది |
| కుడగు దేశమున | ౧౮-గురు |
| మొత్తము | ౫౨,౬౨౬ గురు. |

కొఱవలు (ఎఱుకులు) చాపలును, బుట్టలును అల్లుచు, పందులు మొదలగు జంతువులను పెంచుచు దేశమువెంట తిరుగుచుందురు. అందుచే వీరిభాషకు నిలుకడ ఉండు ననుకొనరాదు. అయినను భాషాచరిత్రమునకు పనికివచ్చు అంశములు కొన్ని గైకొనఁదగును.

పలుకుబడి:— తుదిపొట్టిహల్లులు స్పష్టముగా పలుకరు; వానితోడి అచ్చులు తఱుచుగా మాఱును.
ఉదా. తోఁపంకె,తోఁపంకి,తోఁపంక,తోఁపంక్=తండ్రికి.

తుది ళ్ సాధారణముగా లోపించును, ఉదా. ఆగ=వారు; కాని ఆగళ్-ఉల్లి=వారిలో.

తొలిహకారము తఱుచుగా లోపించును. ఉదా. ఓగి, హోగి=పోయి. ఇందలి హకారము తమిళములో పకారము. కన్నడమున హకారమే.

మొత్తముమీఁద విభక్తి ప్రత్యయములు కన్నడమును, బహువచన ప్రత్యయములు తమిళమును అనుసరించి యుండును.

## కొంకణి

పురంధర్-గడి అణ్ణు శోణ్ణ్రి ఒరు ఊరు ఉత్తర్ దేశ్ తుల్లి ఇగదు. అవ్రూ రవత్న్నా దాణ్-ధర్మ్ శైయ్యాక్-ఇల్లా. అవణ్ కంజిస్తణ్ ఉడిపిక్కర్క-ఒసరే కృష్ణా ఒరుప్యాన్ పెణాంబ్ర-నా సోంగ్ అకొ్ర్కండు అ శ్యావ్‌కార్ - సౌటి-కె వందు ఓడి గిర్క ఆత్తిందూ. శ్యావ్‌కార్ అశ్‌గంపూ 'ఉడ్యాల్‌వా, నాణ్ ఇమాణ్ పణీ-మేసే ఇగరే.'

పురంధర్‌గడ్ అని చెప్పే ఒక ఊరు ఉత్తరదేశములో ఉన్నది. వాఁడు రవంతైనా దానధర్మము చెయ్యలేదు. వాని లోభిత్వము ఉడిగించుటకొఱకు కృష్ణుఁడు ఒక పేద బ్రాహ్మణుని వేషము ధరించి ఆ సాహుకారుదగ్గరఱకు వచ్చి అడుగ మొదలుపెట్టెను. సాహుకారు అనేవాఁడు 'రేపు రా, నేను నేఁడు పనిమీఁద ఉన్నాను.'

## కైకాడీ

ఇది ౧౯౩౧ సం. జనాభాలెక్కలనుబట్టి బొంబాయి రాష్ట్రములో ౧౪౮౪ గురును, బీరారులో ౧౦,౭౩౨ రును, నైజాము రాష్ట్రమున ౨౩౬౦ మందియు, మధ్యరాష్ట్రములోని నిమారులో ౨ గురును—మొత్తము ౧౪,౫౭౮ గురు మాటలాడుచుండిరి. కైకాడీలు చాప అల్లుచు దేశమువెంట తిరుగుచుందురు.

ఈ భాష మాటలాడు తమిళముతో పెక్కు చందముల పోలియుండును; కాన ఇది దానికి ఉపభాషగా ఎన్నుచున్నారు. తక్కిన తమిళపు ఉపభాషలవలెనే అనేకాంశములలో కన్నడమును పోలి యుండును. కాఁబట్టి ఇది తమిళకన్నడముల తొలిబాసనుండి పుట్టియుండవలె.

ఇది అంతటను ఒకటేరూపున లేదు. షోలాపురపుది స్వచ్ఛమైనది. తక్కినచోట్ల అక్కడ హెచ్చుగా మాటలాడు భాషలవలన మాఱియుండును. అయినను మొత్తము మీఁద మార్పులు తక్కువ. ఎలిచ్పురపుభాష కైకాడీ బుర్గండీలను కలుపు కొక్కి మానవచ్చును.

బహువచనప్రత్యయములు.—గా, ఆంగ్.

విభక్తిప్రత్యయములును, క్రియారూపములును మొత్తము మీఁద కొఱవలో వానిని పోలియుండును.

కైకాడీ మచ్చు

వంశ మక్ సన్-క్ రంశ గోగా ఇంచ్‌గా. గావా, నన్నాన్ పాంగ్ నాట్-క్ తా. అశు అడున్-క్ క్యాల్లాళి ఫ్యెంద్రిల్ మేఇచిర్క్ పోచిటూ. అంగే వంశ బండ ఇంను. అప్పో అ ఖుద్రిల్ ఆశుంగ్ పాతాంగ్.

ఒక మనుష్యునికి ఇద్దఱు కొడుకులు ఉండిరి తండ్రీ, నా భాగము నాకు ఇమ్ము వాఁడు వానిని పొలములో పందులను మేపుటకు పంపెను. అక్కడ ఒక బండివాఁడు ఉండెను. అప్పుడు ఆ గుఱ్ఱములను వారు చూచిరి.

## బుర్గండీ

ఇదియు దేశమువెంట తిరుగు ఒకజాతివారు మాటలాడుభాష; కైకాడీకి మిక్కిలి దగ్గఱగా ఉండును. ఇది మధ్యరాష్ట్రములోని నిమారులో ౧౯౦౧-వ సం. జనాభాలెక్కనుబట్టి ౨౧ మందియు, నడియిందియాలో ౭౫౭ మందియు మాటలాడుచుండిరి. ఈభాష చుట్టుపట్టుల భాషల బలిమిచే సన్నగిల్లిపోవుచున్నది.

బుర్గండి మచ్చు

అత్నే మోట్ మోంగ్ క్వాల్ - మేలే సీడిస్. నినే తేమ్ వాంచీర్. నింగ్ పలానే అప్ పియానే. అద్గల్కే లల్లే తింగ్రేగ్ నేజా. పదా నింగ్ నిక్కా కాంగ్. జో నా-మాక్కే సిర్ జో నినే సిర్.

అతని పెద్ద కొడుకు పొలములో ఉండెను నీ తమ్ముఁడు వచ్చియున్నాఁడు. నీవు చెప్పినది చేయుదును. వానికొఱకు గొప్పవిందు చేసితివి. పదా నీవు ఉన్నావు కలసి. ఏది నాదగ్గఱ ఉన్నదో అది నీదై ఉన్నది.

(ఇప్పటికి పైని తెలిపినవే తమిళమునకు ఉపభాషలుగా కైకొనవలయును. ఇవి మాటలాడువారు ౧౯౦౧ సం. జనాభాలెక్కలనుబట్టి ౬౯,౧౭౦ మంది.)

(తెన్వాంగడపుభాషలనుగూర్చి పరిశోధనము చేయుట అత్యావశ్యక మని కాల్డువెల్ పండితుఁడును, గ్రీర్సను పండితుఁడును ఎంతో నొక్కి-నొక్కి చెప్పియున్నారు.) కాని వారి

మాటలు ప్రజలచెవికేఁగాని, ప్రభువులచెవికేఁ గాని ఎక్కలేదు. ప్రజలలో అట్టితలంపు కలవా రెవరయిన ఉన్నను, బీదతికము చే వా రాపని సాగింపఁజాలక తమలో తాము వగచుచు మిన్నకుండవలసివచ్చుచున్నది. ఇఁక ప్రభువులా? వారి చిత్తము. తమయిచ్చ వచ్చుపనులకే సొమ్ము వెచ్చింతురుగాని, తక్కినవానిపొంతకు పోరు. ఎటులైన నేమి? క్రియ సున్న. కాన, తెన్వంగడపుభాషలనుగూర్చి బోగాట్టా సరిగా ఎవరికేఁ గాని తెలియరాకున్నది. అందుచే తమిళమునకు ఇంకనుమఱి కొన్ని ఉపభాషలు కలవో లేవో స్పష్టముగా చెప్పుటకు వీలు లేదు. దక్షిణదేశభాషల పరిశోధనము జరుగుభాగ్యము మఱి ఎప్పటికో!

తమిళ వాఙ్మయము

తెన్వంగడపుభాషలలో వాఙ్మయము మొట్టమొదట బయలుదేఱిన గౌరవము తమిళమునకే దక్కినది. అందు తొలి గ్రంథము అగస్త్యమహర్షి వ్రాసినట్లు చెప్పుదురు. 'తొల్కాప్పియమ్' అను మిక్కిలితొల్లింటి వ్యాకరణము ఆయనశిష్యుఁ డొకఁడు రచించెనఁట. అది ఎప్పటిదో సరిగా ఇంకను తేలలేదు. అందు ప్రాచీనగ్రంథకర్తలప్రయోగములు కలవు. దానిలోని పెక్కు పద్యప్రయోగములనుబట్టి అప్పటికే తమిళమున వాఙ్మయ మున్నట్లు కనఁబడును. పవణంత్రి వ్రాసిన 'నన్నూల్' దాని తరువాతి పూర్వవ్యాకరణము. పిదప

పెక్కు వ్యాకరణములు బయలుదేఱినవి. తొలి తమిళ వాఙ్మ యము జైనుల ప్రయత్నముచే ప్రారంభమైనట్లు కానవచ్చును. తక్కిన భాషలతో పోల్చిచూచినచో దానికి సంస్కృతసంబంధము మిక్కిలి తక్కువ. నీతికావ్యరచనను బట్టి అది మహోన్నతస్థితికి వచ్చిన దనవలయు. మాలఁడయ్యును మతబోధకుఁడైన తిరువళ్ళువరు ౧౩౩౦ పద్యములలో వ్రాసిన 'కుఱళ్' సాంఖ్యయోగమును బోధించును. ఇది తమిళ వాఙ్మయరత్నములలో ఒకటిగా వెలయుచున్నది. అది పదవ శతాబ్ది దని కాల్డువెల్ పండితుని తలంపు. తిరువళ్ళువరు తోఁబుట్టువు 'పూజ్యురాలు' అగు 'ఔవైయార్' తమిళ కావ్యములు వ్రాసి మిక్కిలి వన్నెకెక్కినవారిలో ఒకతె

'కుఱళ్' వంటి మఱొక గొప్పనీతికావ్యము 'నాలడియార్'; ఇదే మొదటిది కావచ్చు నని కొంద అందురు.

'మణిమేఖలై', 'శిలప్పదికారమ్', 'జీవక చింతామణి', 'వళయాప్పది', 'కుండలకేశి'—ఇవి పంచకావ్యము లందురఁట. రామాయణము 'కంబన్' వ్రాసె ఇవి కాక ఎన్నియో గ్రంథములు వాఙ్మయమును పెంపొందించినట్లు తెలియవచ్చును.

'దివాకరమ్' అనునది ప్రాఁతనిఘంటువు. తరువాత పెక్కు నిఘంటువులు బయలుదేఱినవి. ఇపుడు చెన్నపురి

విశ్వవిద్యాలయమువారి పెద్దఱికముక్రింద పెద్ద తమిళ నిఘంటు వొకటి అచ్చుపడుచున్నది.

## అచ్చుపొత్తములు

అచ్చుపని, దక్షిణదేశమున సుమారు ౧౬-వ శతాబ్ద నడుమను, గోవాలో ప్రారంభమైనది. అందులకు పూను కొనినవారు 'జెసూత్తులు' అను క్రైస్తవులు. వారు సంస్కృతము, తమిళము మొదలగుభాషలు చదివెడివారఁట! యూరపువారికి మనదేశభాషలు చదువుటలో ఉన్న శ్రద్ధయు, పట్టుదలయు మనవారికి లేకపోవుట దేశదురదృష్టము కాక మఱేమి? వారు ప్రచురించినగ్రంథములును, మనభాషలను పరిశోధించుటలో వారు చేసిన కృషియును చూచినచో — అందు వారొప్పుకొనినటుల లోపము లుండిన ఉండుఁగాక! — అయ్యో! మనము మనభాషలలో తగినకృషి చేయఁజాలక పోతిమికదా! అనువగపే కాక, సిగ్గుసైతము భాషాభిమానులకు కలుగకుండు టెట్లు? ఈకొఱంత తీఱుట ఎప్పుడో! మన భాషలనుగూర్చిన ప్రమాణగ్రంథములు ఇప్పటివలె పైవారు వ్రాసినవి కాక మనవారు వ్రాసినవే అగుట ఎప్పుడో!

తొలిమలబారుతమిళపువ్రాల దిమ్మలు ౧౫౭౭ - వ సం. మున కొచ్చిలో జొరన్నెస్‌గొన్‌సల్‌వెస్స అను జెసూత్తు చెక్కెనఁట! ఆయేఁటనే తొలిక్రైస్తవ పుస్తక

మచ్చుపడినట్లు కాల్డ్వెల్ బిషప్పు తెలుపుచున్నాఁడు. పిదప ౧౬౭౭ లో చిన్న తమిళ వ్యాకరణము వెలువడె. ౧౬౭౯ లో కొచ్చిలో తొలి తమిళనిఘంటు వచ్చుపడె. ౧౬౮౦ లో క్రొత్త తమిళవ్యాకరణము ప్రచురించిరి. ౧౮ - వ శతాబ్ది మొదటినుండి పెక్కుపొతములు తమిళములో ట్రాంక్వెబారులోని డేనిష్ మిషనరీలు అచ్చువేయించిరఁట! పదంపడి తమిళులును పుస్తకములు వెలువఱిచిరి. పైవారు పైభాషలలో ప్రచురించినవి పెక్కులు కలవు. అంతః పైదేశములలో అచ్చుపడినవియు కొన్ని కలవు.

## వ్రాలు

మిక్కిలి తొల్లింటి శాసనములలోని వ్రాలకును, ఇప్పటివానికిని భేదము కానవచ్చును. తమిళమున ఈక్రింది వ్రాలకుమాత్రమే సమానములగు వర్ణములు కలవు.

అచ్చులు:—అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ.

**హల్లులు:**—క, చ, ట, త, ప, ఙ, ఞ, ణ, న, మ, య, ర, ల, వ, ఴ, ళ. ఇవికాక హెచ్చుగా ఉన్నవి ఱ, ఩, అనునవి రెండు.

పైవ్రాలు పరికించుచో హల్లులలో గ, ౘ, జ, ౙ, డ, ద, బ, లును, ఒత్తువ్రాలును, స, హ లును లేనట్లు తెలియవచ్చును.

క—గ, హాలవలె పలుకును.

చ—జ, శ, సలవలె పలుకును.

ఱ—మూర్ధన్యము.

న—నుడిమొదట రాదు; తుదనే హెచ్చుగా వచ్చును.

హల్లు లన్నియు లేమిచేతనే తమిళమునకు అఱవము పేరు వచ్చె నని కొంద ఱందురు.

పై వ్రాలకు ష, స, జ, క్ష, హా-లకు సమానము లగు వ్రాలను చేర్చి అన్నిటిని గ్రంథాక్షరము లందురు. వీనిలో సంస్కృతము వ్రాయుదురు.

తమిళమున అజంతములే కాక హలంతములును కలవు.

తమిళము మచ్చు

ఒరు మనుషనుక్కు ఇరండు కుమారర్ ఇరున్దార్గళ్. ఒరువనుమ్ అదై అవనుక్కు కొడుక్కవిల్లై. నానో పశియినాల్ శాగిఱేన్. ఇనిమేల్ ఉమ్ముడైయ కుమారన్ ఎన్ఱు శొల్లప్పడువదఱ్కు నాన్ పాత్తిరన్ అల్ల.

ఒక మనుష్యునకు ఇరువురు కుమారులు ఉండిరి. ఒకఁడును అది వానికి ఇయ్యలేదు. నేనో ఆఁకలిచే చచ్చుచున్నాను. ఇఁకమీఁద మీ కుమారుఁడను అని చెప్పఁబడుటకు నేను పాత్రుఁడను కాను.

## ౨. మలయాళము

మలయాళము మొదట తమిళమునకు ఉపభాషగానే ఉండెను. పిదప స్వతంత్రవాఙ్మయమును పెంపొందించుకొని, ఆధునికకాలముననే స్వతంత్రభాష అయినది. ఇది ౧౯౦౧ జనాభాలెక్కలనుబట్టి ౬౦,౨౨,౧౩౧ మంది మాటలాడు చుండిరి. మల + ఆళమ్—అను నుడులు కలసి 'మలయాళమ్' అయ్యె. మల=కొండ ; ఆళమ్=చోటు. కాన మలయాళము మొదట దేశపుపేరు, పిదప భాషపేరయ్యె. మలయాళమును తెలుపుటకు తొలుత సంస్కృతమున వాడినది కేరళపదము. అది మలయాళమున 'కేరళమ్', 'చేరళమ్', 'చేరమ్' అనురూపములతో కానవచ్చును. కేరళపదము అశోకశాసనములలో క్రీ. ము. 3-వ శతాబ్దిని వాడిరి.

### మాటలాడు ప్రదేశము

ఇది పడమటి సముద్రతీరమున ఉత్తరమున కాసర్‌గోడునుండి దక్షిణమున త్రివేంద్రమువఱకును మాటలాడుదురు. తూర్పుహద్దు పడమటి కనుమలు; పడమటిహద్దు పడమటి కడలి. ఇందు దక్షిణకన్నడముజిల్లాలోని దక్షిణభాగమును, మలబారు, కొచ్చి, మైసూరు, నీలగిరులలోని పడమటి భాగములును, తిరువాన్కూరు సంస్థానములోని చాలభాగమును చేరియుండును. దీనికి ఉత్తరమున తుళుభాషయు -

కుడగులో కుడగుభాషయు, తూర్పున కన్నడమును-తమిళ మును మాటలాడుదురు.

వాఙ్మయమున్న తక్కిన తెన్వంగడపుభాషలకువలెనే మలయాళమునకును రెండు వేఱురూపులు కలవు:-౧ ప్రాఁత వాఙ్మయమున వాఁసినది; ౨ మాటలాడునపుడు వాడునది. వాడుకభాషకంటె వాఙ్మయభాష తమిళముతో హెచ్చు సంబంధము కలిగియుండును. వాఙ్మయము లున్న ద్రావిడ భాష లన్నిటిలో తమిళము సంస్కృతపదములు మిక్కిలి తక్కువగా వాడుచుండ, మలయాళము అన్నిటికంటె అవి హెచ్చుగా వాడుటయేకాక, సంస్కృతప్రత్యయములుకూడ వాడుచున్నది. కుడగుదేశములోని యెఱవభాష దీని ఉప భాష అందురు. మఱేదైన ఉన్నదో లేదో తెలియదు. ఎఱవయు ఎఱుకులభాష యేమో అని కొందఱితలంపు. ఎఱవ మాటలాడువారు ౧౩,౧౭౫ మంది.

## వా ఙ్మ య ము

డాక్టర్ గుండర్ట్ మలయాళమున వాఙ్మయము 'రామ చరిత'తో(౧౩-౧౪ శతాబ్దులు) ప్రారంభమయ్యె నని తెలిపె. అంతకుముందు కొన్ని శాసనములలో ఈభాష వాడిరి. మిక్కిలి ప్రాఁతమలయాళపువాఙ్మయము తమిళపద్యకావ్య ముల ననుసరించి వ్రాసిరి. కాని తరువాత సంస్కృతకావ్య ముల ననుసరించి వ్రాయ మొదలిడిరి. మొదటిమహాకవి తుం

జత్తు ఎర్రుత్తచ్చన్ (౧౭ శతాబ్ది) అతఁడు మహాభారతమును, మఱికొన్ని పురాణములును వ్రాసె. ౧౮ శతాబ్దితుదిని 'కుంజన్ నంబియార్' పంచతంత్రము, నలచరిత్ర మొదలగు నవి వ్రాసె.

మలయాళపువాఙ్మయములో చిల్లరపాటలు, కథలు, కేరళోత్పత్తి అనుచరిత్రగ్రంథము, కొన్నివైద్య గ్రంథములు మొదలగునవియు కలవు. టిప్పు దండయాత్ర మలయాళపు పద్యకావ్యములకు పిడు గయ్యె నందురు. ఈనడుమ కొన్ని సంస్కృతనాటకములు మలయాళములో వ్రాసిరి; కాని అందును సంస్కృతపదములు మెండు. కొన్ని నవలలును బయలు దేఱినవి. ఆధునికకాలమున యూరోపియను మిషనరీలును, క్రైస్తవమతావలంబకు లైన స్వదేశస్థులును మలయాళపువాఙ్మయమునకు ముఖ్యపోషకు లైరి. నిఘంటువ్యాకరణములు డాక్టర్ గుండర్ట్ వ్రాసె. రాజరాజవర్మవిరచిత మగు 'కేరళపాణినీయమ్' తరువాతిది.

౧౭౭౩ లో పోర్చుగీసున దీనివ్యాకరణము మలయాళపునుడులజాబితాతో అచ్చుపడె. ౧౭౯౬ లో పోర్చుగీసు- ఇటాలియను మిషనరీలు మలయాళపునిఘంటువు సిద్ధపఱిచిరి. వ్యాకరణములు కొందఱు వ్రాసిరి; వెల్లడించిరి. డాక్టర్ గుండర్ట్ వ్రాసినదే మేలైనది. కాని శాస్త్రీయమై,

యూరోపియనుపద్ధతిని వ్రాసినదిలేదు. పిదప నిఘంటువులు మొదలగునవి అచ్చుపడినవి.

ప్రాంతమలయాళమున క్రియలలో తమిళమునందువలె పురుషప్రత్యయము లుండును. ౧౩ శతాబ్దినుండి ఆప్రత్యయములు పో మొదలిడి ౧౫ శతాబ్దితుదికి పూర్తిగాపోయె. అయినను లక్షద్వీపములలోను, దక్షిణకన్నడపు మోప్లాల భాషలోను వానిమిగుళ్ళు కానవచ్చు.

ఇపుడు మలయాళపువారు కొందఱు సంస్కృతవ్యామోహము వదలి, తాము వ్రాయుపొత్తములలో మలయాళపుమడులే హెచ్చుగా వాడుచున్నట్లు తెలియవచ్చినది.

మలయాళము మచ్చు

అవనుమ్ మువలిసె అవర్కు్క పకుదిచెయ్దు. ఇళయ మగన్ దూరదేశత్తేక్కు యాత్రపోయి అవిడె దుర్నడప్పాయి జీవిచ్చు తన్ డె వస్తు నానావిధమ్ అక్కికళాన్ను. వానో విశప్పుకొండు నాశిచ్చుపోసున్ను. వేగమ్ మేల్ త్తరమ్ఆయ అంగి కొండువన్ను ఇవనె ఉడుప్పిప్పిన్.

తండ్రి ఆస్తి వారికి పంపకముచేసె. చిన్న కొడుకు దూరదేశమునకు యాత్రపోయి అక్కడ దుర్నడతఅయి జీవించి తన ఆస్తి నానావిధముల పాడుచేసెను. నేనో ఆకలికొని నశించిపోవుచున్నాను. వేగము మేలిరకమయిన అంగి కొనివచ్చి వీనిని తొడిగింపుడు.

౭. కన్నడము

చెన్నరాష్ట్రమున వాయువ్యభాగమునను, చుట్టుపక్కలజిల్లాలలోను కన్నడము సుమారు కోటిమంది మాట్లాడుచున్నారు.

## పేరు

కన్నడ మనఁగా కన్నడమను దేశములోని భాష. తొలి పేరు 'కర్నాడు' అందురు. కర్నాడు(కర్ + నాడు) = నల్ల దేశము అని డాక్టర్ గుండర్ట్ వ్యుత్పత్తి చెప్పె. దక్కను పీఠభూమి ప్రత్తిపండునల్లరేగడి నేల అగుటచే ఇది సరిఅయిన దే కాఁదగు నని కొందఱి నమ్మకము. దీనిసంస్కృతము 'కర్ణాట' పదము వరాహమిహిరుఁడు తన బృహత్సంహితలో ౬ శతాబ్దిని వాడె. ఇది కన్నాడ (కన్నాట) అను ప్రాకృతరూపము నుండి సంస్కృత మయ్యె నని కొంద ఱందురు. 'కర్నాడ' నుండి అని విద్వాన్ కూరగనూరు నరసింగ రావుగారితలంపు. ఇంత యేల ? 'కర్నాటు' నుండి 'కర్ణాట' పద మేర్పడరాదా? 'నాడు' నుడికి 'నాటు' అను రూపమును వాడుకలో కలదు. కర్ణాటశబ్దము సోమదేవుని కథాసరిత్సాగరమున కానవచ్చుటచే ఉత్తరదేశ వాఙ్మయములోనికి పైశాచీప్రాకృతద్వారమున చేరినట్లు నిశ్చయముగా ఊహింపనగును. కాని ఆ కథాసరిత్సాగరమునకు మూలమగు గుణాఢ్యుని ప్రాచీనపైశాచీ బృహత్కథ ఇపుడు దొరకకున్నది.

## మాటలాడుప్రదేశము

కన్నడము మైసూరురాజ్యమునను, దాని చుట్టుపట్టుల నుండు కోయంబత్తూరు, సేలము, అనంతపురము, బళ్లారి జిల్లాలలోను, ఉత్తరకన్నడముజిల్లాలోను, దక్షిణమున

తప్ప దక్షిణకన్నడముజిల్లాలోను మాటలాడుదురు. మఱియు దీని వాడుక నైజాము రాష్ట్రములోని బీదరు నుండి ప్రారంభమై, సతారాజిల్లాను ఔంధ్‌సంస్థానమును బెళ్గామును కొల్హాపురమును పడమటి కనుమలను తాఁకుచు, పడమటిసముద్రమునువఱకును పోవును. కన్నడపు వారు తమభాషను మధురకును, మధ్యరాష్ట్రములకును చేర్చిరి. కన్నడమునకు, ఉత్తరమున మరాటియు—దాని ఉపభాష అగు కొంకణియు, తూర్పున తెనుఁగును - తమిళము, దక్షిణమున తమిళమును - కుడగుభాషయు - తుళువమును మాటలాడుదురు.

బళ్లారిజిల్లాలో కొంతవఱకును, అనంతపురముజిల్లాలో హెచ్చుగాను తెనుఁగుకూడ మాటలాడుదురు. కోయంబత్తూరు మొదలగు జిల్లాలలోను తమిళమును, తెనుఁగును మాటలాడుదురు. సతారా మొదలగుచోటుల మరాటి మాటలాడుదురు. ఇందువలన కర్నాటియుం దంతటను కన్నడము మాటలాడుట లేదనియు, తక్కిన భాషలుకూడ మాటలాడుచున్నారనియు తేటతెల్లమగును. భాష ముఖ్యముగా చేసి కొని మాటలాడుచో, కావేరీ గోదావరీమధ్యభూమి కొంతవఱకు కర్ణాటదేశ మగును గాని అంతయు కన్నడపు దేశము మాత్రమే కానేరదు. ఈ భేదమును పాటింపక విద్వాన్ నరసింగరావుగారు రూపమును బట్టికాని, భాషను

బట్టికాని కర్ణాటదేశ మనిపించుకొన వీలులేని ప్రదేశమును కర్ణాటదేశములో చేర్చి నెల్లూరు, బెజవాడ, ఓరుగల్లు- అను పేరులు కన్నడపదములే అని తమదేశపు పిల్లలను నెంచినారు. "వెంగిమండలములను గాని, విజయనగరమును లోఁగొన్న దత్తమండలములను గాని తెలుఁగునాఁడని యెట్లు చెప్పఁగలుగుదును?" అని ప్రశ్నించినారు. వెంగిమండలమునకు రావుగారు హద్దులు చెప్పకపోవుటచే దానిమాట వదలివేసి అందఱకును తెలిసిన దత్తమండలములలో తెలుఁగు మాటలాడు ప్రదేశమంతయు, రూపమునుబట్టి కర్నాటదైనను, భాషను బట్టి తెలుఁగునాడే అని నిస్సందేహముగా చెప్పనగును. నెల్లూరు, బెజవాడ, ఓరుగల్లు మొదలగుచోట్ల కన్నడము ఎవ్వరును మాటలాడుచుండిరో రావుగారు తెలిపెదరుగాక!

## ఉపభాషలు

తమిళపుటుపభాషలనుగూర్చి ముచ్చటించుచో తెలిపినట్లు తెన్వంగడపుభాషల పరిశోధనము సరిగా సాగమిచే కన్నడమునకును ఉపభాష లేవో నిర్ణయించుటకు వీలు చాల తక్కువ. తెలిసినవానిలో మిక్కిలి ముఖ్యమగునది బడగ భాష; అది క్రొత్తకన్నడముకంటె ప్రాచీనమైనది; అనేకాంశములలో ప్రాఁతకన్నడపు వాఙ్మయభాషను పోలియుండును. బడగభాస మాటలాడువారు బడగలు; వారిసంఖ్య 3౮, ౨౨౯. (౧౯౨౧ సం॥ జనాభా.)

రెండవ ఉపభాష కురుంబ; ఇది మాటలాడువారు కురుంబజాతివారు. ఈ జాతియో, దీనివంటిదో ఒక జాతి చాందాలో 'కురుమ్వార్' అనునది కలదు. ఆ జాతీవారి భాషలో దానికి దగ్గఱగా నున్న తెనుఁగుజాడలు కొన్ని కానవచ్చును. కురుంబజాతివారు ౧౧,౩౭౧ మంది. (౧౯౦౧ సం॥ జనాభా.)

తక్కినఉపభాష లంత ముఖ్యములు కావు. 'బీజపుర ములోని కన్నడపుఁపలుకుబడిలో కొంత మార్పు కనఁబడును. మధ్యరాష్ట్రములలోని గోలరులభాష చాలవఱకు బీజపురపు భాషను పోలియుండును. అందు బడగబాసలోవలె 'ప్రాఁత రూపములు కలవు. కాన గోలరీభాషయు మఱొక ఉపభాష కావచ్చును. గోలరులు ౩౪౬౮ మంది. (౧౯౦౧ జనాభా.)

బడగమచ్చు

ఒబ్బ మనిచగ ఎరడు మక్కళ్-ఇద్దరు. అప్పొ, ఆ స్త్రీయొ యొనగ బప్ప కూర తా జోది జినగ్ - హింటెదె కున్నమాతి ఎల్లావ నేతియుంశు మూరదేచగ కడెను హోగి అల్లి కెట్టవమ్నాగి బదికి తన్న బదుకెల్లావ బీజి హొళ్ళమాడిబుట్టమ్. ఆలె నామ్ ఇల్లి హసూంద సత్తెనె.

ఒక మనుష్యునకు ఇరువురు కొడుకులు ఉండెరి. తండ్రీ, ఆ స్త్రీలో నాకు వచ్చు వంతు ఇమ్ము. కొన్ని దినములపిదప చిన్న కొడుకు అంతయు చేర్చి దూరదేశమునకు కడచి పోయి అక్కడ చెడ్డవాఁడయి బ్రదికి తన బ్రదుకెల్ల బీఱుపుచ్చి పాడుచేసెను. కాని నేను ఇక్కడ ఆఁకలివలన చచ్చుచున్నాను.

కురుమ్మారీమచ్చు

ఒబ్బ మన్సెక్ ఇబ్బరు మకాళు ఇద్దరు అదొగా చిన్నోను అయ్యనుహూడే అందా. అవను పిల్లగాను సొమ్ము అంచి కొట్టానె పిల్లె అంతపల్లా. ఒందొందొ ఆకాశా ఎరడు ఎరడు సేర్ల ఆలు కొడ్తను వున్నా బకరియాలు నాకునాకు సేర్ల ఆలు కొడ్తను

ఒక మనుష్యునకు ఇర్వురు కొడుకులు ఉండిరి. అపుడు చిన్న వాఁడు తండ్రితో అనెను. అతఁడు పిల్లగానికి సొమ్ము పంచి ఇచ్చెను. పిల్లది అనినది. ఒక్కొక ఆవు రెండు రెండు సేర్లు పాలు ఇచ్చును. మఱియు బఱ్ఱెలు నాల్గునాల్గు సేర్లు పాలు ఇచ్చును

గోలరీ (హోలియా) మచ్చు. (భండరజిల్లా)

అందకో నా యది - ఇల్లా. పొహొటక యొడదెవ. ఆగ్ నాద్ద మాణిక హుంన్ ఖోలీ ఆన్. అన్ ఖోలింవ కవాడ తెరకో కాఙ్స్త. మాత్ మాల అల్లె ఇద్దీల్లా.

అందువలన నేను లేవలేదు. ప్రొద్దుట లేచితిమి. అపుడు మా యింటిలో ఒక గది ఉన్నది. ఆ గదినుండి తలుపు తెఱచి కనఁబడెను. మఱియు సామానులు అక్కడ లేవు.

వాఙ్మయము

(తెన్వంగడపుభాషలలో తొలుత వాఙ్మయము బయలు దేఱినభాష తమిళ మనుకొంటిమి. దానితరువాతిపీఠము కన్న డమునకు వచ్చినది.) వాఙ్మయభాష 'హళగన్నడ'ము, 'హొసగన్నడ'ము అని రెండు తెఱంగులు. (హళ= ప్రాఁత. హొస=క్రొత్త.) ఈ రెండింటికిని పలుకుబడిలోను, ప్రత్యయములలోను, వాక్యనియమములలోను భేదము కాన

వచ్చును. మఱియు కొందఱు కన్నడమును ప్రాతకన్నడము (౧౦ శతాబ్దినుండి ౧౩ శతాబ్ది సగమువఱకు), నడికన్నడము (౧౩ శతాబ్ది సగమునుండి ౧౭ శతాబ్ది తుదివఱకు), క్రొత్తకన్నడము (౧౮ శతాబ్దినుండి) అని విభజించిరి. కాని సరిగా పరికించుచో హళగన్నడము తొలి గ్రాంథికభాష అనియు, క్రొత్తకన్నడపుయుగమునకూడ దానిలో వ్రాసిన గ్రంథములు కలవనియు తెలియవచ్చును కాన హళహొస గన్నడములకు కలిగినభేదము కాలమునుబట్టి కాక పైని తెలిపినటులు పలుకుబడి మొదలగువానివలని దే. హళగన్నడమున అచ్చకన్నడనుడులును, పద్యములలో జాతివృత్తములును (సంస్కృతములో లేనివి) హెచ్చుగా ఉండును.

వాఙ్మయమును తొలుత పెంపొందించినవారు జైనులు పిదప శైవులును, అద్వైత - ద్వైత - విశిష్టాద్వైతులును పెక్కుగ్రంథములు వ్రాసిరి.

మిక్కిలిప్రాంతకన్నడము క్రీ. పె. ౨ శతాబ్ది గ్రీకునాటకమున కనఁబడినటులు హాట్ పే పండితుఁడు తెలిపె. ౩ శతాబ్దిని మాధవరాజు 'దత్తసూత్రవృత్తి' అనుగ్రంథము వ్రాసినట్లు తెలియవచ్చుచున్న దని విద్వాన్ గంటిజోగిసోమయాజిగారు తమ 'ద్రావిడభాషలు' అను గ్రంథమునందు తెలిపిరి. ౯ శతాబ్దిని నృపతుంగదేవుఁడు 'కవిరాజమార్గ' మను లక్షణగ్రంథము రచించినట్లును, అతఁడు తా నది విమలోద

యనాగార్జునాదికర్ణాటపద్య మహాకవుల లక్ష్యలక్షణగ్రంథ ముల ననుసరించి వ్రాసెనని తెలిపినట్లును విద్వాన్ కూరిగ నూరు నరసింగరావుగారి 'కన్నడిగలు - తెలుగలు' అనువ్యా సమువలన తెలియవచ్చును.

జైనులగ్రంథములు:—౧౦ శతాబ్దిని పంపకవి(౯౪౧) భారతము (విక్రమార్జునవిజయము), పొన్నకవి శాంతిపురా ణము (పురాణచూడామణి), రన్నకవి గదాయుద్ధము (సాహ సభీమవిజయము) వ్రాసిరి కవిచక్రవర్తి అనుబిరుదు దొందిన జన్నకవి యశోధరచరిత్ర వ్రాసె. నాగవర్మ కాదంబరియు, ఛందస్సును, తొలి కర్ణాట వ్యాకరణమగు కర్ణాటభాషాభూష ణమును వ్రాసినాఁడు. అభినవపంపబిరుదము ధరించి నాగ చంద్రుఁడు రామాయణము గంభీరశైలిని వ్రాసెనఁట; ఇతని శైలి తరువాతివారికి ఆదర్శ మయ్యె నందురు. ఆండయ్యకవి (౧౨౩౫) 'కబ్బిగరకావ' అను అచ్చ కన్నడపుఁగబ్బము కూర్చి పేరొందె. ఆగ్గళకవి (౧౨౦౧) చంద్రప్రభాపురాణము వ్రాసె; లీలావతీప్రబంధమును ఇతఁడే రచించి యుండవచ్చు నందురు. కేశిరాజు 'శబ్దమణిదర్పణ' మను వ్యాకరణము రచించె; దీనికి నిష్ఠూర నంజయ్య వ్యాఖ్యానము వ్రాసె.

నృపతుంగదేవునికి ముందు వ్రాసిన పద్యగద్యగ్రం థము లేవో తెలియరాదు. చావుండరాయఁడు (౧౦ శతాబ్ది) వచనప్రధాన మగుకావ్య మొకటి వ్రాసినట్లు తెలియవచ్చును.

శైవుల గ్రంథములు:—వీరశైవులకు గురువగు బసవారాధ్యుఁడు తనమతతత్త్వమును వచనరూపమున వ్రాసె. ఇట్లే పలువురు వీరశైవులు తమమతమునుగూర్చి వచనగ్రంథములు వ్రాసిరి. పద్యగ్రంథములును వెలువడె. అందు సోమేశ్వరశతకము (౧౫౦౦) పేరు పొందినది. విరూపాక్షపండితుఁడు చక్కనిశైలిని బసవపురాణము వ్రాసె. షడక్షరికవి హళగన్నడములో రాజశేఖరవిలాసము (౧౬౫౭), వృషభేంద్రవిజయము (౧౬౭౧), శబరశంకరవిలాసము (౧౬౮౦) మొదలగు ప్రఖ్యాతకావ్యములు రచించె. నీతిబోధకములగు త్రిపదులు సర్వజ్ఞమూర్తికవి వ్రాసె. హరీశ్వరరాఘవాంకాదులు సుప్రసిద్ధులగు వీరశైవకవులంట; వారిగ్రంథము లేవో తెలిసికొనఁదగు.

అద్వైతుల గ్రంథములు:—చంద్రరాజు(౧౦౪౫) సరసచిత్రకవిత్వమున 'మదనతిలక'మును, చౌండరసకవి (౧3౦౦) అతిమృదులశైలిని 'అభినవదశకుమారచరిత్ర'మును, కర్ణాటసరసకవిసార్వభౌముఁ డననొప్పు రుద్రభట్టు 'జగన్నాథవిజయ' మును, కుమారవ్యాసబిరుదాంకితుఁడగు నారాయణప్పకవి సర్వజనాదరపాత్రమగు 'కర్ణాటభారత' మును, తిమ్మణ్ణకవి కృష్ణదేవరాయల కంకిత మిచ్చి 'కర్ణాటభారతశేష'మును, కుమారవాల్మీకి (౧౫౯౦) 'కర్ణాటరామాయణ'మును, బబ్బూరు రంగకవి వీరరసప్రధాన మగు 'అంబి

కావిజయ'మును, నిత్యాత్మశుకయోగి, 'కర్ణాటభాగవత' మును, కవిచూతవనచైత్రబిరుదమందిన లక్ష్మీశుఁడు(౧౬౬౦) 'కర్ణాటజైమినిభారత'మును (అశ్వమేధపర్వము) వ్రాసి వన్నె కెక్కిరి.

ద్వైతులగ్రంథములు:— దాసకూటకవులకు మార్గదర్శకుఁ డనఁదగు శ్రీపాదరాయలు 'శ్రీమధ్వనామము' వ్రాసె. పాటలును, 'హరికథామృతసార'మును పురందరదాసపరంపరకు చేరినవారు చెప్పిరి. 'ఇవి ప్రసిద్ధవ్యావహారికభాషలో వ్రాసిరఁట.

విశిష్టాద్వైతులగ్రంథములు:— తిరుమలార్యుఁడు, చిక్కుపాధ్యాయుఁడు మొదలగు విశిష్టాద్వైతకవులు మైసూరు మహారాజులపోషణమున పెక్కుగద్యపద్యగ్రంథములు వ్రాసిరి. అందు హస్తిగిరిమాహాత్మ్యము మొదలగునవి సుమారు ౩౦ గ్రంథములు చిక్కుపాధ్యాయుఁడు వ్రాసెనఁట.

పంచతంత్రము, వేతాలపంచవింశతి మొదలగు వచనకావ్యములు హొసగన్నడమున వెలువడె.

పైని పేర్కొనినవ్యాకరణములు గాక భట్టలంకదేవపండితుఁడు కర్ణాటకశబ్దానుశాసనము వ్రాసె; దానికి 'భాషామంజరి' అనువృత్తియు, 'మంజరీమకరంద' మనువ్యాఖ్యయు కలవు. ఇంకనుమఱికొన్ని వ్యాకరణములుకూడ బయలుదేఱినవి.

ఆధునిక గ్రంథములు:—రావుబహాదూర్ ఆర్. నరసింహాచార్యులుగారు హళగన్నడములో 'నీతిమంజరి' వ్రాసిరి. రామాశ్వమేధాదులగు గ్రంథములు మఱికొన్ని కూడ హళగన్నడములో వ్రాసినవే. కవులజీవితములు మొదలగు గ్రంథములును బయలుదేఱినవి. 'బైబిలు' కన్నడమున వెలసినది. కర్ణాటవాఙ్మయచరిత్రము ఇంగ్లీషులో రైసుదొరగారు వ్రాసిరి. అటులే కిటెల్ దొరగారు వ్యాకరణము వ్రాసిరి. కీ. శే. బి. వేంకటాచార్యులుగారు బంగాలీభాషలోని నవలలను కొన్నింటిని కన్నడములో వ్రాసినారు. మఱియు గద్యపద్యకావ్యములు పెక్కులు వ్రాసినారు, వ్రాయుచున్నారు.

కన్నడమునమూన

ఒబ్బ మనుష్యనిగె ఇబ్బరు మక్కళిద్దరు అవరల్లి చిక్కవను తందెగె 'తందెయే ఆస్తియల్లి ననగె బరతక్క పాలన్ను ననగె కొడు' అంద. కెలవుదినగళ మేలె చిక్కమగను ఎల్లా కూడిసికొండు దూరదేశక్కె హొరటు అల్లి దుందుగారనాగి బదుకి తన్న ఆస్తియన్ను హాళుమాడిబిట్టను ఆదరె నాను హసివెయింద సాయుత్తేనె.

ఒక మనుష్యునికి ఇద్దరు కొడుకు లుండిరి. వారియందు చిన్నవాఁడు తండ్రికి, 'తండ్రీ ఆస్తిలో నాకు రాఁదగిన పాలు నాకు ఇమ్ము' అనెను. కొన్ని దినములపిదప చిన్నకొడుకు అంతయు కూర్చుకొని దూరదేశమునకు వెళ్లి అక్కడ దుబారగాఁడు - అయి బ్రదికి తన ఆస్తిని పాడుచేసివేసెను. కాని నేను ఆఁకలివలన చచ్చుచున్నాను.

## 3. తుళుభాష - తుళువము

మొదటితెగలోని ముఖ్యభాషలగు తమిళము, మలయాళము, కన్నడము—అను మూఁడుభాషలను గూర్చి ముచ్చటించినపిదప, వాఙ్మయము కొలఁదిగాఁఉన్నను మిక్కిలి హెచ్చుగా పెంపొందినభాష అగుటచే తుళువమే ఎన్నఁదగినది. అందు తొలుత దాని పెంపుకొఱకే కృషి జరిగినట్లు కనఁబడును. కాని ఏకారణమునో కొన్ని పాటలు తప్ప గ్రంథములు వెలువడవయ్యె. తెనుఁగునం దభిమానము కలిగి అల్లసాని పెద్దన్న మొదలగు తెనుఁగుకవులను పోషించిన కృష్ణదేవరాయనిది తుళువాన్వయము. 'వానివంశంబు తుళువాన్వవాయ మయ్యె' అని మనుచరిత్రము. తెనుఁగువారు కొందఱును, కన్నడపువారు కొందఱును కృష్ణదేవరాయని 'మావాఁడు', 'మావాఁడు' అని ఇంతవఱకు చెప్పుకొనుచున్నారు గాని ఇప్పుడు 'మీవాఁడును కాఁడు', 'మీవాఁడును కాఁడు' 'ఆయన మావాఁడే' అని చెప్పుకొనఁగల తుళునాటివారు కొందఱు బయలుదేఱినారు. కాన తక్కినవారు తమ వాదములు కట్టిపెట్టుకొనవచ్చును. గ్రంథములు వ్రాయఁజాలనివారు తుళునాట లేకపోవుటచేతనే కాఁబోలు ఆభాషాపోషకుఁడు తుళుభాషలో గ్రంథములు వ్రాయింపఁడయ్యె. తగిన వాఙ్మయములేనిదయ్యును తుళు తెన్నంగడపుభాషలలో దేనిలోఁగాని పాండిత్యముగడించుకొనఁదలఁచువారు మెలఁకువతో

చదువఁదగినదే కాని త్రోసివేయవలసినది కాదు. ఇది దక్షిణ కన్నడపుజిల్లాలో మాటలాడుదురు.

'తుళు' నుడికి 'నెమ్మదియగు' అని అర్థ మగుటచే అది మొదట జనుల పేరు గాని భాషకు పేరుకాదని కొందర అతలంపు ఇఁక నరసింగరావుగారు 'తుళు' 'తుడు'రూపాంతర మని యు, 'తుడు'నుడికి కన్నడమున 'ఎక్కు వెట్టు' అని అర్థ మగుటచేత శస్త్రోపజీవులగు తుళువారికి అట్టిపేరు వచ్చియుండు ననియు వ్రాసినారు. నిజమేమో!

౧౯౦౧ సం. జనాభాలెక్కలనుబట్టి తుళుమాటలాడువారు ౫,౩౫,౨౧౦ మంది. కాని ౧౯౧౦ లో పైభాషలు దీనిని అణఁచివేయుచుండుటచే 3 లక్షల మందికంటె హెచ్చుగా ఉండరని గ్రీర్సన్‌పండితుఁడు వ్రాసె. దీనినిబట్టి ఈభాష త్వరలో నశింపవచ్చు నని కొందఱు తలంచుచున్నారు. కాని తుళువలు ద్రావిడ జాతివారలలో మిక్కిలి పట్టుదలఁకలవా రగుటచేతను తుళుక్రైస్తవులు తుళుకన్నడములు రెండును నేర్చుకొనుచుండుటచేతను ఇది నశించు నని తలఁప వీలులే దని కొందర అనుచున్నారు. దీనికి తగినట్లు తుళునాటివారు కొందఱు తమవ్యక్తిత్వమును నిలుపుకొనవలయు ననునిశ్చయమున తుళుమహాసభ ఏర్పఱచి, ౧౯౨౯ లో వార్షికసంచిక ప్రచురించిరి. భాషాభివృద్ధి చేయుటకును

వారు ప్రయత్నించుచున్నారు. దైవానుగ్రహమున వారి ప్రయత్నము ఫలించి, తుళుజనులస్థితితోపాటు వాఙ్మయమును పెంపొందుఁగాక!

తుళుబ్రాహ్మణులు సంస్కృతము వ్రాసికొనుటకు మలయాళపువ్రాలు వాడుకొనుటచేత కాఁబోలు తుళువము మలయాళమునకు ఉపభాష అని కొందఱు తలంచిరి. కాని ౧౮౭౨ లో బ్రిగెల్‌దొరగారు తుళువ్యాకరణము ఇంగ్లీషున ప్రచురించినపిదప అద్భుతాకర్షణవంతమగు ఈభాషనుగూర్చి అప్పటికి క్రొత్తవిషయములు తెలియవచ్చె. తమిళమునకును, మలయాళమునకును ఉన్న భేదముకంటె, మలయాళమునకును, దీనికిని ఉన్న భేదము హెచ్చు. కన్నడమునకును, మలయాళమునకును ఉన్న భేదముకంటె, దీనికిని మలయాళమునకును ఉన్న భేదము హెచ్చు. కాన ఇది మలయాళమునకు ఉపభాష కాదు. తమిళమునకును, దీనికిని భేదము చాల హెచ్చు. కుడగుభాషకును, దీనికిని భేదము చాల తక్కువ.

బ్రిగెల్‌గారివ్యాకరణ మచ్చుపడినపిదప ౧౮౮౬ లో ఏ. మేనర్‌దొరగారు వ్రాసిన తుళు - ఇంగ్లీషునిఘంటువును, కొన్నిబ్రాహ్మణకుటుంబములలో మలయాళపులిపిలో తాటాకులమీఁద వ్రాసియుంచిన తుళుపాటలు కొన్నియును అచ్చుపడినవి. ఇప్పుడిప్పుడు తుళునాటివారు తల్లిభాషపై అభిమానము కలిగి పాటలును, పద్యములును, వచనకావ్యములును

వ్రాయుచున్నారు. అందు కొన్ని అచ్చుపడుచున్నవి. తుళుమహాసభకు కార్యదర్శి అగు ఎస్. యూ. పణియాడిగారు తుళు వ్యాకరణము వ్రాయుచున్నారు. మహాసభవారి వార్షికసంచికలును, మఱికొన్ని గ్రంథములును, ఇఁకముందు వెలువడవచ్చును. ఇపుడు కన్నడలిపిలోనే తుళుపాత్రము లచ్చుపడుచున్నవి. ఊశిపి మంగలూరుపట్టణములు దీనికి ముఖ్యస్థానములు.

తుళుమచ్చు

పుచ్చె పక్కిన్ అంచుంతు. బర్పె అంన్ న్ పండె. ఆయె మళ్పయె. యెంక్ బంజి ఆలసుంతు. ఉప్పు తిందినాయె నీర్ పర్వె తన తరెకు తన కై. తాను మల్తినవు ఉత్తమ; మగె మల్తినవు మధ్యమ; ఆళు మల్తినవు హీళు. సాదిడ్ పోతి మారిను తన మిత్త పాడొండె.

పిల్లి పక్షికై పొంచియుండును వచ్చును అని చెప్పె. వాఁడు చేయఁడు. నాకు కడుపు నొచ్చుచున్నది. ఉప్పు తిన్నవాఁడు నీరు త్రాగును తనతలకు తన చేయి. తాను చేసినది ఉత్తమము; కొడుకు చేసినది మధ్యమము; కూలివాఁడు చేసినది అధమము. దారిని పోవు మారిని తనమీఁదికి తెచ్చుకొనె.

ఇప్పటికి తొలితెగలోని ముఖ్యభాషలనుగూర్చి ముచ్చటించుకొంటిమి. ఇఁక దానిలో మిగిలియున్న కుడగు, తోడ, కోట అనుభాషలనుగూర్చి తెలిసికొనవలసియున్నది. కాని ఇవి మాటలాడువారిసంఖ్యయు తక్కువయే; వీనినిగూర్చి

తెలిసినబోగట్టాయును తక్కువయే. వీనిమచ్చులుకూడ ఇప్ప టికి దొరకలేదు.

### ౪. కుడగు-కొడగు

ఇందు సరియగు రూపము 'కుడగు' అని కొంద అందురు. 'కుడ' అనఁగా ప్రాఁతతమిళమున పడమర అని అర్థము. కాన కుడగు = పడమట నుండువారి భాష. ఇది స్వతంత్రసంస్థానముగా ఉండిన కొడగుదేశమున మాటలాడు దురు. మైసూరుసంస్థానమునకును, దక్షిణకన్నడము జిల్లాకును మలబారునకు నడుమ నుండు కొడగునాడు కన్నుల పండు గుగా కానవచ్చును. కుడగుభాష తెన్వంగడములోని భాష లలో దేనికి మిక్కిలి దగ్గఱదో సరిగా తెలియదు. కాని ప్రాఁతకన్నడమునకును తుళువమునకును నడిమి కొక్కి మని తలంపనగు నని కొంద అందురు. తుళువమువలె ఇదియు పలుకుబడివింతలనుబట్టి క్రొత్తవారిని చిక్కుపెట్టు నని పేరు పొందినది. ఇది మాటలాడువారు ౩౯,౧౫౧ మంది. దీనికి ౧౮౬౭ లో బెంగళూరిలో ఉండిన మేజర్ కోల్ దొరగారు వ్యాకరణము వ్రాసి వెల్లడించిరఁట. ఈనడుమ ఇందు కొన్ని పొత్తములు వ్రాసినటులు తెలియవచ్చినది.

కుడగుమచ్చు

ఆ కోలి కిణ్ణ్ తాడ తంగెన నూకిట. అవడ మండెవింజి కుడిక

ఉద్దుకు చూర్ చూరాయిను వడందు పోచి. నల్ల కిణ్ణంగ అయుండ

అక్క - తంగియ - తల్లి ప్రీతి యుళ్లవరాయితు ఇప్ప. నీకు వందన మాడువి; అవ్వా! నాకు ఇన్న హెచ్చ హణ్ణు బోండ. నీన సింగడ అణ్ణన ఎన్నా చెంగియూ కేటతంగి అద్న దయచెచ్చితు నాకు కా ఎణ్ణ నన్న ఒళకె పోపక్ బుడు.

ఆ గుంటరిచిన్నవాఁడు తన చెల్లెలిని కొట్టెను. ఆమె తలమీఁది కుండ పడి ముక్కముక్కలయి పగిలిపోయె మంచి పిల్లవాండ్రు తమ అక్క - చెల్లెండ్ర యందు ప్రేమ కలవారయి ఉందురు. నీకు వందనము చేసెదను; అమ్మా! నాకు ఇంక హెచ్చు పండ్లు అక్కఱలేదు. నీవు నీయొక్క అన్నను ఏమిఅయినను అడిగినయెడల అది దయచేసి నాకు ఇమ్ము అనుము. నన్ను లోపలికి పోవనిమ్ము.

౫. తుద తొౕద-తోడ

నీలగిరులలో ఎనుములను పెంచి వానివలన బ్రతుకు అడవివాండ్రు కొందఱు కలరు. వారిసంఖ్య ౮౦౫ అని ఇంతకుముందు తెలియవచ్చినది. వారు మాటలాడు భాషకే పై పేరులు వాడుచున్నారు. కన్నడమున 'తొౕదవరు' అను నుడి ఒక అనాదిజాతివారిని తెలుపునది కలదు. ఆతొౕదవరులు నీలగిరులలో ఉండువారే అయినచో వారి భాష 'తొౕద'అన వచ్చును. దాని తొలిరూపు 'తుద' కావచ్చును. విద్వాన్ గంటి జోగిసోమయాజిగారు 'తుద-తొౕద-తోడా(తోడ)'— అను మూఁడురూపములను వాడినారు. విద్వాన్ కొరిగనూరి నరసింగరావుగారు 'తోడ' అను రూపము వాడినారు. 'తోడలు కన్నడిగలతో నుండినవారు కాఁబోలు.' అని

వ్యుత్పత్తి చెప్పెనారు. కాల్డ్వెల్ పండితుఁడు 'తోడ' అను రూపము గ్రహించి, అది తుడజాతివారిభాష అనియు, వారిని తుడవరు లనికూడ పిలుతురనియు వ్రాసె. ఇంగ్లీషు వ్రాలతో వ్రాసిన 'తొడ' 'తోడ' అనియు పలుకుటకు వీలుండుటచే 'తొడ'రూపము వచ్చినదేమో! పరిశోధింపవలయును. ఎటులు వచ్చినను నీలగిరులలో ఎనుములవలన బ్రతుకు అడవి వాండ్రకు 'తోడాలు' అను పేరును, వారి భాషకు 'తోడా' (తోడ) అనుపేరును చిరకాలమునుండి వాడుకగుచున్నవి. డాక్టర్ పోప్‌దొరగారు దీనికి సంగ్రహవ్యాకరణము వ్రాసిరి. అందు తుదిని 'ఈభాష మొదట ప్రాంతకన్నడమువలె కనఁబడునుగాని ప్రత్యేకోపభాష కాదు. బహుశా తుడజాతివారు కన్నడదేశమునుండి వలసవచ్చి, నీలగిరులలో సుమారు ౮౦౦ ఏండ్లనుండి ఉన్నారు. పోలిగార్లవలన వీరి భాషలోనికి కొన్నితమిళరూపములు వచ్చినవి. బడగలతోడి సంపర్కమునుబట్టి కొన్నినుడులకు క్రొత్తరూపు వచ్చుటయే కాక, కొన్నిక్రొత్తనుడులు చేరినవి. తక్కిన తోఁబుట్టువులకంటె భిన్నముగా ఉండు అంశములలో తోడభాషకు మలయాళము తోడి పోలికయు కానరాదు.' అని కలదు.

౭. కోట

ఇది కోటజాతివారిభాష. వారు నీలగిరులలో కూలి చేసికొని బ్రతుకు నేర్పరులగు పనివాండ్రు. తోడాలకు పాఁడి

చేసికొనుటకు వలయు కుండలు మొదలగు మట్టిసామాను
కోటాలే చేసి యిచ్చుచుందురఁట. వెనుకటి లెక్కలను బట్టి
వారిసంఖ్య ౧౩౦౦. కోటాలు మనుష్యమాంసము తిందు
రని వారిదగ్గఱకుపోవుటకు పైవారు వెనుకదీయుదురఁట. కోట
భాష ప్రాచీనమైనదనియు, కన్నడముతో చేరిన మోటు ఉప
భాష అనియు కొందఱు తలంతురు.

పైని వ్రాసిన విషయములను బట్టి (దక్షిణ దేశములో
వాడుచున్న తెన్వంగపుచిలుబాసలలో పెక్కింటికి తక్కిన
భాషలతోకంటె కన్నడముతో హెచ్చు పొత్తు ఉన్నట్లు
తెలియవచ్చును.)

ఇప్పటికి తొలితెగ మొదటికోవలోని యేడుభాషలును
అయినవి. రెండవకోవలోని కురుఖు, మల్తో అను రెండుభాష
లనుగూర్చి కొంత తెలిసికొనఁదగు

౮. **కురుఖు**

ఇది బీహార్-ఒరిస్సా రాష్ట్రములోను, మధ్యరాష్ట్ర
ములలోను కురుఖుజాతివారు మాటలాడుభాష. ఈభాషను
కాల్డువెల్ పండితుఁడు 'ఒరాయన్' అనుపేర వ్రాడెను. కాని
ఇది మాటలాడుజాతివారు తమ్ము 'కురుఖ్' అనుపేర తెలుపు
కొనుటచే గ్రీర్సన్ పండితుఁడు జాతిపేరే వారిభాషకును వాడె.

కురుఖులు తమపూర్వులు కర్ణాటదేశమునుండి నర్మదా
నది దాఁటివచ్చి మహామ్మదీయులు తఱిమివేయఁగా ఒకతెగ

రాజమహాలుకొండలు చేరినట్లును, రెండవ తెగ చోటానాగ పుర పీఠభూమిలో వాయవ్యభాగమును ఆక్రమించుకొని నట్లును తెలుపుదురఁట. ఇది ద్రావిడజాతుల తొలినివాసము దక్షిణదేశమే అనువారి వాదమునకు అనుకూలముగానున్నది. కురుఖులను ఒరాఁవ్ లనియు వాడుదురు. వీరు ౧౯౦౧ సం. జనాభా లెక్కలనుబట్టి ౬,౦౯,౭౨౧ మంది కాని, తరువాత సుమారు లక్షమంది తగ్గినట్లు తెలియవచ్చును.

కురుఖులు నివసించుప్రదేశములును, ముండాజాతివారు నివసించుప్రదేశములును కలసిమెలసి యున్నవి. అందుచే కురుఖులు కొందఱు తమభాష వదలివేసి ముండారిభాష మాటలాడుచున్నారఁట. ముండాభాషలయు, ఆర్య భాషలయు సంపర్కమువలన కురుఖుభాష చెడుచున్నది.

కురుఖు వాఙ్మయముకల భాష కాదు. దీనికి విడిగా వ్రాలులేవు. బైబిలుభాగములు మొదలగునవి దేవనాగరలిపిలో అచ్చుపడినవి. డాక్టర్ హాన్ దొరగారు దీనికి వ్యాకరణము వ్రాసిరి. ఆయన వ్రాసిన కురుఖు-ఇంగ్లీషునిఘంటువు ౧ వ భాగము కలకత్తాలో ౧౯౦౩ లోను, కురుఖుల కథలు ౧౯౦౫ లోను ప్రచురపడినట్లు తెలియవచ్చును. మఱి కొందఱు కురుఖుభాషను గూర్చి వ్రాసి, నుడుల జాబితాలు ప్రచురించిరఁట.

కురుఖుమచ్చు

ఒర్త్ ఆలస్-గహి ఇర్బ్ ఖద్దర్ రచర్. సన్నిస్ తమ్-బసిగ్ ఆన్యస్. ఆస్ ఆసిన్ తన్‌హై ఖల్ల్-ను కిస్స్ ఖాపా తైయస్. అంతికే ఆస్ చోఁచస్. ఏన్ డిస్ బర్ చస్. కోపస్ ఊలా కోర్'ఆ కులాబిద్ద్యస్ ఏన్. ఏమ్ నీన్ నీమ్. తాన్ తామ్. ఆద్. ఆర్.

ఒక మనుష్యునకు ఇరువురు కొడుకులు ఉండిరి. చిన్నవాఁడు తన తండ్రితో అనెను. అతఁడు ఆతనిని తన పొలములో పందులను మేపుటకు పంపెను. అంతట అతఁడు లేచెను. నీసోదరుఁడు వచ్చెను. పెద్దవాఁడు లోనికి చొచ్చుటకు యత్నింపలేదు. నేను. మేము. నీవు. మీరు. తాను. తాము అది. ఆమె వారు

౯. మల్తో

ఇది సాంథాల్ పరగణాలలోని రాజమహాలు కొండలలో మాత్రము సుమారు ౧౨౦౦౦ మంది మాటలాడుదురు. మల్తో అనుపేరు మాటలాడు జనులు తమ భాషకు వాడునదే; మలెరులభాష అని దీనికిఅర్థము. 'మలెర్' నుడికి మల్తోభాషలో మనుష్యులు అని అర్థము. కాని సరి అయిన అర్థము కొండమనుష్యులు కావచ్చును. రాజమహాలు కొండలలో వాడుభాష అగుటచే రాజమహాలీ అని మల్తోభాషకు మఱొకపేరు వాడుదురు.

దీనికి వాఙ్మయము లేదు. డ్రోజే అను మిషనరీ దీనికి వ్యాకరణము వ్రాసెను మిషనరీలు బైబిలుభాగములు కొన్ని తర్జుమా చేసి రోమనక్షరాలతో అచ్చువేయించిరి. కురుఖు

మల్తోభాషలు మిక్కిలి దగ్గఱవి. అయినను ఆర్యభాష లగు బంగాలీ బీహారీల సంపర్కమునుబట్టి వానిలోని పదములు దీనిలో హెచ్చుగా చేరినవి. ఇరుగుపొరుగుల వాడుకలో నున్న సాంథాలీపదములును కొన్ని చేరినవి. చిన్న నిఘంటువు ప్రచురింపఁబడినట్లు తెలియవచ్చును. మల్తో పాటలు కొన్ని అచ్చుపడినవి

మల్తోమచ్చు

ఒర్త్ మలెక్ ఇర్ప్ మక్యార్ బెచ్చర్. ఆఁకా ఆహ్ ఆరి చాగ్ కహ్ బిచహ్. ఆ దేశితో అకాలెక్ ఉట్రాక్ ఏన్ ఎగ్ అబ్బ బహక్ ఏకెఁ. తమ్బకోహ్ తంగ్ నాక్రియరిన్ అల్డ్‌యహ్. నాక్ ఈ. ఆర్. ఈక్ నిగ్-గోహ్ బర్‌చహ్.

ఒక మనుష్యునికి ఇరువురు కొడుకులు ఉండిరి అప్పుడు వాఁడు వారికి పంచి ఇచ్చెను. ఆదేశములో కఱవు పట్టెను నేను నాఅబ్బ దగ్గఱకు పోదును. వానితండ్రి తన చాకర్లనుగూర్చి అనెను మనము. ఈ. వారు ఇగ. నీ సోదరుఁడు వచ్చెను

ఇప్పటికి మొదటితెగలోనిభాషలు తొమ్మిదియు ముగిసినవి. ఇఁక రెండవతెగలోనిభాషలనుగూర్చి ముచ్చటించుటకు ముందు ఈరెండు తెగలకును నడుమ కొక్కెములవలె ఉన్న గోండి, కోఁదు భాషలనుగూర్చి కొంత తెలిసికొనఁదగు.

౧౦. గోండి

గోండి ఉత్తర దేశములోని ప్రధానద్రావిడభాష. గోండులు మాటలాడుభాష కాన గోండి అయ్యె. హేమచం

ద్రుఁడు మొదలగు సంస్కృత నిఘంటుకారుల గ్రంథములలో గోండుపదము ఒకతక్కువ తెగవారి పేరుగా కానవచ్చును. గోండువనము గోండు లుండుచట్టే. ఇదే ఇప్పటిమధ్య రాష్ట్రములలోని హెచ్చుభాగము. గోండులమనికిపట్టు చిర కాలమునుండి ఉత్తరమున నర్మదలోయకును, దక్షిణమున నాగపురసమప్రదేశమునకును నడుమనుండు పీఠభూమియే. పట్టణములు దీనికి ఎల్లలుగా కైకొన్నచో ఉత్తరపుటెల్ల జబ్బలపురము; దక్షిణపుటెల్ల నాగపురము. కాని వీరితో సంబంధించిన తెగలవారు గోండువనమునకు ఉత్తరదక్షిణముల నుండు కొండలలోను, అడవులలోను నివసించియుండవలె. గోండులు తమజాతిపేరు 'కోఇ' అందురు. గోదావరి, విశాఖపట్టణముజిల్లాల మన్నెములలోని కోయలు గోండులే. కోయ భాష తెనుఁగుతోడిసంబంధమువలన పెక్కువిషయములలో తెనుఁగును పోలి పెంపొందిన గోండిభాషయే కాని ప్రత్యేక భాష కాదు.

## మాటలాడుప్రదేశము

మునుపు గోండులు సంఖ్యలో ఇప్పటికంటె హెచ్చుగా ఉండుటయే కాక బలముగల జాతివారుగా కూడ ఉండిరి. అప్పుడు గోండి మిక్కిలి విస్తీర్ణమగు ప్రదేశమున మాటలాడు చుండినట్లు తలంపఁదగు. అయినను నానాఁటికి వారిలో

పెక్కండ్రు ఆర్యనాగరకతకు లోఁబడి, తమపూర్వాచార ములతోపాటు స్వభాషయు వదలివేసిరి. ( ౧౯౧౧ సం. జనాభా లెక్కలనుబట్టి గోండులు ౩౦,౬౧,౬౮౦ మంది. కాని గోండి మాటలాడువారు మాత్రము ౧౩,౭౯,౫౮౦ మందియే. ఈ లెక్కయును కొంత హెచ్చే కావచ్చును. మునుపు గోండికి ఉపభాష లనుకొనినవి చాలకాలము క్రిందటనే ఆర్య భాషావర్గములో చేరినవి! బస్తరుసంస్థానములో ఓఢ్రపుఉప భాష అయిన భత్రీయును, ఇపుడు మరాటీతో చేర్చిన హాల్బి యును, అర్ధద్రావిడభాషలును ఈతరగతిలోనివే. కాఁబట్టి గోండి మాటలాడు ప్రదేశము మునుపటికంటె ఇపుడు చాల తగ్గిపోయినది. పెక్కుచోట్ల గోండి కొండలలో మాత్రము నిలిచినది. పల్లపుపట్టుల నన్నింటిని ఏదో ఆర్యభాష దీనిని అణఁచివైచినది. అందుచే ఎడతెగక కలసియున్న ఒకటే ప్రదే శమునఁగాక గోండి ఇపుడు విడివిడిచోట్ల వాడుకగుచున్న దుర్ద శకు వచ్చినది. పాటలీపుత్రము, బిలాసపురము, జబ్బలపురము, భోపాలము, అమరావతి, నాగపురము, రాయపురము, ఛాందా, బస్తరు, గోదావరి-విశాఖపట్టణము జిల్లాలలోని మన్నెములందలి పడమటివైపులు, నైజామురాష్ట్రములోని కంబముమెట్టు, సిరిపురము, తాండూరు-చూచాయగా గోండి మాటలాడు చోటులు. )

## భా ష ల యె ల్ల లు

గోండికి మొత్తముమీఁద ఉత్తరమున రాజస్థాని, పడమటి హిందీ, తూర్పుహిందీ భాషలును, తూర్పున ఓఢ్రము, హాల్బి, ఛత్తీస్‌ఘరీ, తెనుఁగు భాషలును, దక్షిణమున తెనుఁగును, పడమట మరాటీభాషయును మాటలాడుదురు.

## ఉ ప భా ష లు

స్థలభేదమునుబట్టి గోండికి మఱిఆ, గట్టు, కోఇ (కోయ) అనుపేర్లుకూడ వాడుకలో ఉన్నవి కాని అవి ప్రత్యేకముగా ఉపభాష లనఁదగునంతభేదము కలవికావు. భోయి, లఘాడి అనునవి దీనికి ఉపభాష లనిరి. కాని ఇపు డవి మాటలాడు వారే కానరారు. కాన అవి లెక్కింపఁదగినవి కావు. కోలామీ-నైకీభాషలు ఒకప్పుడు దీనికి ఉపభాష లనిరి. కాని వానికిని దీనికిని హెచ్చుభేద ముండుటచే అవియు దీనికి ఉపభాషలుగా ఎన్నఁదగదు. ఇవన్నియు పోఁగా మిగిలినపర్జి ఒకటియే దీనికి నిజమగు ఉపభాష అనఁదగు. ఇది మాటలాడు వారు బస్తరుసంస్థానములోని ఆదిమవాసులు ౧౯౦౧ సం. జనాభాలెక్కలనుబట్టి వారు ౮౯33 మంది.

## వా ఙ్మ య ము

గోండి వాఙ్మయ మున్నభాష అని చెప్ప వీలులేదు. కాని గోండిపాటలు పెక్కులు వాడుకలో ఉన్నవి. అందు కొన్ని

అచ్చుపడె. గోండిభాషకు విల్లియమ్సన్ పండితుఁడు వ్యాకర
ణము వ్రాసె; ఆయనయే చిన్ననిఘంటువు కూడ వ్రాసె.
పలువురు పాశ్చాత్యపండితులు గోండినిగుఱించి వ్రాసియు
న్నారు. బైబిలుభాగములు కొన్ని గోండిలోనికి తర్జుమా
చేసిరి. ఈ తర్జుమాలో దేవనాగరలిపి వాడిరి. కాని తెనుఁగు
లిపి ఈభాషకు తగినది. కోయభాషలోనికి లూక్ సువార్త
తర్జుమా చేసినపుడు తెనుఁగులిపియే వాడిరి. అచ్చులో ఈ
రెండులిపులే కాక రోమనులిపియు ఉపయోగించిరి.

కొన్నివిషయములలో గోండి తెనుఁగును పోలియు
న్నను, పెక్కువిషయములలో తమిళకన్నడములను పోలి
యున్నది. కాఁబట్టి తమిళకన్నడములు పుట్టిన తొలిభాష
నుండియే గోండికూడ ఏర్పడియుండును అయినను గోండి
ముఖ్యముగా దక్షిణమున కోయభాష అనుపేర తెనుఁగునకు
లోఁబడుచున్నది. కాని ఉత్తరమున ఇంతకంటె హెచ్చుగా
ఆర్యభాషలకు లోఁబడిపోవుచున్నది—అనఁగా ఆర్యభాషా
పదములు గోండిలో హెచ్చుగా చేరుచున్నవి. ఇంతే కాదు.
క్రొత్తగా వచ్చిన ఆర్యభాషలు నానాఁటికి ప్రాంత ద్రావిడ
భాష అగు గోండిని అణఁచివైచుచున్నవి. మఱికొంతకాలము
నకు గోండి స్వతంత్రభాషగా ఉండఁజాలనిస్థితికి వచ్చి రూపు
మాయు నేమో అనుచున్నారు కొందఱు. మాటలాడువారికి
నాగరకతయు, స్వభాషాభిమానమును లేకపోవుటచేత నే కదా

భాష లిట్టిదురవస్థకు పాలగుట! బానిసతనమునకు లోనైన భరతఖండమున నాగరక భాషలకే వలయు పెంపుసొంపులు చేకూఱనిస్థితిలో అనాగరకభాష లడుగంటుచుండుటకు చోద్యమంద నేల? అహో! భాషాచరిత్ర ఎంత చిత్రమైనది! గోండీ బాసపెంపునుగూర్చియు, గోండీల పెంపును గూర్చియు, కొందఱు పెన్నవారు ఒక సంఘముగా ఏర్పడి పనిచేయుచున్నట్లు తెలియవచ్చుచున్నది.

గోండిమచ్చు

ఏ దాదా, నన్నా స్వర్గతా బిరుధ్ అరి నీవా ముణ్నె పాప్ కితోనా. బోకే అిడ్మిళోర్ రండ్ ఖర్క్ మత్తోర్క్. అన్ నాకున్ సీకా తన్ ఓన్ ఓరున్ అపోన్న సంపత్ తూసీ - సీకుర్. అస్కె అప్ పేకె తె బహో అకాల్ అర్త్ ఇగా కర్బూ సాయి తోనా ఓన్ చూమే - కేతుర్. మత్తీ ఓన్ సీ ఇర్తూర్

ఓ తండ్రీ, నేను స్వర్గమునకు విరుద్ధముగా మఱి నీ ముందు పాపము చేసియున్నాను ఒకానొక మనుష్యునికి ఇద్దఱు కొడుకులు ఉండిరి అది నాకు ఇమ్ము అప్పుడు వాడు వారికి తన సంపద పంచి-ఇచ్చెను. అపుడు ఆదేశములో గొప్ప కఱవు పడెను. ఇక్కడ ఆకలితో చచ్చుచున్నాను. వానిని ముద్దాడెను. కొడుకు వానితో అనెను

పర్జీమచ్చు

ఇన్ పలూత్రీ మాటా పిదిన్ గోండ్ మేదాన్? హోయ్. మే త్రేన్ ఏబే బిల్లే. మాటూ ఏబే ఆలీ చేందేల్? ఆత్రీ చేనాదా. చాఈ చేందే. వాతా నోక్టితి చాఈయేక్, యేదా-అింకకేడే? ఆన్ పునాన్.

మీా ఊరిలో మా ,, పేరు(కల) గోండు ఉన్నాఁడా? అవును. ఉండెను ఇపుడు లేఁడు మాటా ఇపుడు ఎక్కడకు వెళ్లెను? ఎక్కడకును వెళ్లలేదు. చచ్చి పోయెను ఏ జబ్బు (రోగమైన) వచ్చెనా, ఎవఁడైనను చంపెనా? నేను ఎఱుఁగను

కోయభాషామచ్చు

ఒరో మనుషూరికి ఇరువురు మర్కు మత్తోరు. ఓరవులే చూడోండు, 'తప్పేనీ, నీ ఆదాతే నాకి వాదాని పాలు ఈము,' ఇంజి తప్పేరితో కె కత్తోండు అస్కె ఓండు ఓని ఆదాతీని తూసి ఇత్తోండు. సగము రోజ్కు అత్త-పయ్యా చూడోండు ఓని ఆదా అంత కైదె పెయుసి దూరదేశేతికి పైణము అంజి ఓని ఆదాతీని మేలా పణంగిసె ఆగము-తుంగ్ లోండు.

ఒక మనుష్యునికి ఇరువురు కొడుకులు ఉండిరి వారిలో చిన్నవాఁడు, 'తండ్రీ, నీ ఆదాలో నాకు వచ్చు పాలు ఇమ్ము,' అని తండ్రితో అనెను అపుడు వాఁడు వాని ఆదాను పంచి ఇచ్చినాఁడు కొన్నిరోజులు అయిన-పిదప చిన్నవాఁడు వాని ఆదా అంతయు చేత తీసికొని దూరదేశమునకు పైనము అయి వాని ఆదాను చెడ్డ పనులలో పాడుచేసినాఁడు.

## ౧౧. కోఁదుభాష

( ఓఢ్రదేశములోను, విశాఖపట్టణముజిల్లాలో పాలకొండ చుట్టుపట్లను, అడవులలోను, జయపురసంస్థానములోను, కలహాండి మొదలగుచోట్లను కొండలలో ఒకద్రావిడజాతి కలదు. ఆజాతివారినే మనతెనుఁగువారు కోఁదు లందురు.) కోఁదునుడియే ఒడియాలో 'కొంధొ' అని వాడుదురు. 'కొండ'యే

'కోఁదు'గా మాఱెనని కొందఱ తలంపు. కోఁదుల భాషయే కోఁదుభాష. కోఁదులు తమపేరు 'కు' అందురు. వారిసంఖ్య సుమారు ౫ లక్షలు. కోఁదుభాషను 'కుఇ' అనియు వాడుదురు.

## మాటలాడు ప్రదేశము

గంజాము విశాఖపట్టణముజిల్లాల సరిహద్దుకొండలు మొదలుకొని ఉత్కలసంస్థానములలోనుండి మహానదిదాఁటి కోఁదుమలల వఱకును వ్యాపించిన ప్రదేశమునను, మధ్య రాష్ట్రములలో కలహండికి ఉత్తరభాగమునను, పాట్నకు దక్షిణభాగమునను కోఁదుభాష మాటలాడుదురు. దీనిచుట్టును ఓఢ్రమును, దక్షిణమున కొంతవఱకు తెనుఁగును మాట లాడుదురు.

## ఉపభాషలు

ఇందు ముఖ్యములగు ఉపభాషలు ౨: ౧. తూర్పు కోఁదు. ఇదే పల్లపుకోఁదు; కుఇ. ఇది గుమ్సూరు తాలూకా లోను, దానిదగ్గఱి ఉత్కలదేశములోను వాడుదురు. ౨ పడ మటికోఁదు; ఇదే కొండకోఁదు; కువి. ఇది చిన్నకిమిడిలోను, విశాఖపట్టణముజిల్లాలోని జయపురసంస్థానపు మన్నెములోను, పాలకొండచుట్టుపట్లను వాడుదురు.

ఉత్తరమున కోఁదుభాష ఆర్యభాషాసంపర్కమువలన కొంత మాఱినది.

## వాఙ్మయము

కోఁడుభాషకు వాఙ్మయము లేదు, సొంత వ్రాలును లేవు. బైబులుభాగములు కొన్ని కుఇ లోనికి తర్జుమా చేసి, ఓఢ్రలిపిలో అచ్చువేయించినారు, కొన్ని కువిలోనికి తర్జుమా చేసి, తెనుఁగువ్రాలతో వెల్లడించినారు. పల్లుకోఁడుభాషకు లింగము లక్ష్మీపండితుఁడు ఇంగ్లీషున వ్యాకరణము వ్రాసె. మఱికొందఱు పండితులు కూడ వ్యాకరణమును, చిన్న నిఘంటువులును వ్రాసిరి ఇప్పుడు విశాఖపట్టణమున రోమను కాథొలిక్ మతబోధకులుగా ఉన్న ట్యూక్సురే పండితుఁడును, బుపేపండితుఁడును తాము కోఁడుప్రదేశమున పనిచేయు నపుడు వ్యాకరణనిఘంటువులు వ్రాసిరి. కాని అవి అచ్చుపడ లేదు. లక్ష్మీజీ-ఫిట్జీరా-ఫీట్జ్ రాల్డ్ పండితుల వ్యాకరణము లచ్చుపడినవి. పల్లుకోఁదే ప్రమాణభాషగా కైకొనఁదగునని కొంద ఱభిప్రాయపడిరి.

కువిబాసకు ఎఫ్ వి. పి. స్చుల్జ్ పండితుఁడు రోమను లిపిలో ఇంగ్లీషున వ్యాకరణమును, వాక్యములతో నుడుల జాబితాలును వ్రాసి, అచ్చువేయించె. ఆయన కుఇకిని, కువికిని దగ్గఱిపొత్తు కల దని తెలిపెను. అది నిజమే కావచ్చు. కాని, తెనుఁగుకోఁదు నుడులకు పోలికలేదని ఆయన వ్రాసినారు; ఇది పొరపాటు. తెనుఁగుతో పోలు నుడులు ఆయన

పొత్తములలోనే కలవు. సరిగా అరయుదో, నిజము ఆయనకే తెలియునచ్చును. మచ్చుమాటలు పరికింపుఁడు.

లక్ష్మీజీపండితుఁడు కోఁదుభాష తెనుఁగునకు తొల్లింటిభాషయో, తెనుఁగు మారి పర్పడినభాషయో అని తలంచె. అది సరిగా నిజము కాకున్నను, కోఁదుభాష గోండి వలె తెనుఁగునకు తోఁబుట్టువగుట నిజము. కాన నాగరికులగు తెనుఁగువారు అనాగరకస్థితిలో ఉన్న గోండుకోఁదులకు సాయపడి, తల్లి బాసయందు వారికి మన్నన కలిగింప యత్నింపఁదగు. తాము లక్ష్మీజీపండితునివలె కోఁదుభాషయందే కాక, గోండియందును కృషిచేసి, తమ భాషకును, ఆ భాషలకును పెంపు కలిగింపఁదగు కాని మనవారికి ఇప్పటికిని తల్లిభాషయందే తగినంతమన్నన కాని, దానిపెంపునకై ప్రయత్నము చేయవలయునను తలంపుకాని కలుగకున్నది. ఇట్టిదో, ఉట్టికెక్కలేనమ్మ స్వర్గాని కెక్కునా అన్నట్టు పైవారికి తోడ్పడఁగలుగుట ఎట్లు అనవచ్చును. అయినను పైవారి మేలును, తెన్వంగడపుబాసల పెంపును కోరు తెనుఁగువారు కొందఱు జట్టుగా చేరి, విదేశక్రైస్తవమిషనరీలవలె, గోండికోఁదుభాషల పెంపుకొఱకే కాక, గోండుకోఁదులను మంచి స్థితిలోనికి తెచ్చుటకుకూడ పూనుకొనఁదగు.

### కోఁదుమచ్చు

తింజిసావా మ్రాను-గాటాంజు బూడా-గాటాంజు రోఅంజు తానా మాహా పేస్కి-వాతేంజు నాజా-నాయి ఆ కొాగాని మేహి తేంజు; మేహా-నాయి, 'కొాగాంథి, ఆనా గిది నాఇ మ్రానూ తాన్ని? దాందే వావూ, వాఆతేకా ఇస్సింగాతేకా వావా-గీఈ,' ఇంజి వేస్తేంజ. ఏస్నేతే గిది? ఆనూ వావీసూ

తినునప్పుడు మ్రాని - కొామందు ముసలివాఁడు ఒకఁడు తన మామిడిపండ్లు ఏఱుచు - వచ్చెను వచ్చి ఆకుఱ్ఱవానిని చూచెను; చూచి, 'కుఱ్ఱవాఁడా, ఏమి చేయుచున్నావు నాచెట్టుంగో (మీఁద)? వడిగా రమ్ము, రాకపోయిన ఎల్లో వచ్చునట్లు - చేసెద,' అని చెప్పెను నీమి చేసెదవు? నేను రాన

### కువిమచ్చు

రాంఎ బడిలి సొామ్ము హిత్తెరి మ్రాను దగ్గిరె క్లొాలి మన్నె ఈ కద్ద ఇత్తల తోత మన్నె ఈహోరు ఇత్తల తొాత్తొా పేజ, రిత్తె అతిహా అత్తల పాదిఅ కఱ్ఱ ఏచ్చె. నాహాతె అతిహా నాను గల్వాఇ, తరిహాతె అతిహా తాను గెల్వానెసె.

బియ్యాము బదులు సొామ్ము ఇచ్చిరి మ్రాని దగ్గఱ పులి ఉన్నది. ఈగడ్డ (ఏటి) యివతల తోఁట ఉన్నది ఈకొండ ఇవతల వాన కురిసె, కాని దాని అవతల ప్రొద్దు వెలుఁగు ఉండె. నాచేత అగుచో నేను గెలుతును. తనచేత అగుచో తాను గెల్చును.

## ౧౨. కోలామి

ఇఁక రెండవతెగలోని భాషలను గూర్చి తెలిసికొొన వలసి యున్నది. వీనిలో ముఖ్యభాషలలోని దగు తెనుఁగు, అముఖ్యభాషలలోని దగు కోలామీ అను రెండుభాషలే

ఎన్నఁబడినవి. ఇందు అముఖ్యమగు కోలామీని గూర్చియే ముందు ముచ్చటించుకొనఁదగు.

బసిమ్‌జిల్లా పుసద్ తాలూకాలో భీలీ భాషయును, చాందాలో నైకీభాషయును వాడుదురు. వానికిని కోలామీకిని హెచ్చుభేదము లేదు. కాన అవియు, కోలామీయు ఒకటే భాషగా ఎంచవచ్చును. భీలీ-నైకీ - కోలామీ భాషలకును గోండిభాషకును దగ్గఱిసంబంధము కలదు.

తూర్పు బీరారులోను, వరదా జిల్లాలోను ఉండు తొల్లింటిజాతివారగు కోలాములు మాటలాడు భాషయే కోలామి. ఇది కొన్ని యెడల తెనుఁగును, మఱికొన్ని యెడల కన్నడము మొదలగు తెన్వంగడపుబాసలను పోలును. కొన్ని సొగసైన అంశములలో తోడభాషను పోలును. ఇది నానాఁటికి ఉత్తరదేశములోని తక్కిన ద్రావిడభాషలవలెనే సన్నగిల్లుచున్నది. ఇది మాటలాడువారిసంఖ్య ఒకటి రెండువేలకు వచ్చినది. త్వరలో నశింపనున్న ద్రావిడభాషలలో ఇది ఒకటి కావచ్చును. దీని నుడుల జాబితా ఒకటి గోండీనుడులతో అచ్చుపడినది.

కోలామీమచ్చు

ఓక్కోర్టె మాస్ అండెన్ అమ్మెనుంగ్ ఇద్దర్ బాలాకోల్ అండేక్ ఆత్తాఁ చిన్నామ్ ఎన్ తెఁ, 'బా, అన్నెత్ వాటా అను కోర్.' మారీ అమెన్ అవరుంగ్ దఁ పాయాక్నా సితెఁ. అర్ద్ ములుక్ సహోగ్ పాట్టేఁ. తుకెల్ సోసె లిఁహా.

ఒక మనుష్యుఁడు ఉండెను. వానికి ఇద్దఱు బాలకులు ఉండిరి వారిలో చిన్నవాఁడు అనెను, 'బాబూ, నా వాటా నాకు ఇమ్ము' అప్పుడు వాఁడు వానికి ఆస్తి పంచి ఇచ్చెను. ఆ దేశమున కఱవు పట్టినది. పందులు పొట్టు తినెను.

భీలిమచ్చు

ఓకోఁ మాస్ ఇద్దగ్ బాలా అండేర్. సన్నామ్ బాలా బాపమ్ ముట్టేఁ, 'బా, సింగానీ అన్య సీసాన్ వాటవ్-కో' దూస్రే ఊరు ధాయ సెర్గన్. దుకాల్ పట్రేఁ, పైసా ఖర్సీ పెఁ పుట్టెన్. అవఁ తురెల్ మిపెఁ కేమత్ కోసెల్. పొట్ట అఁ త్యవాతూఁ. అవఁదుఁ మారీ సూద్ వత్రీఁ.

ఒక మనుష్యునకు ఇద్దఱు బాలురు ఉండిరి. చిన్న కొడుకు తండ్రికి అనెను 'బాబూ, ఆస్తిలో నా వంతు పంచి-ఇమ్ము' మఱొక ఊరు దవ్వుగా చేరెను. కఱవు పట్టెను, పైకా ఖర్చుపెట్టుటకు పుట్టలేదు వాఁడు పందులను మేపుటకు చేనిలోనికి పంపెను పొట్టు నేను తిందును. వానికి అప్పుడు బుద్ధి వచ్చెను.

సైకీమచ్చు

పోరీ—బా, గవడ్యాక్ పాల్ సుమ్‌తుఁ కోఁతేఁ అఁతేఁ. అడుఁ యఁతేఁ 'ఎత్తే పాల్ సీయాఁ?' బాఁ—పోకీ, అడును ఇడుక్ కీ, 'ఈ నేఁ, అక్‌సోలమ్ పాల్ ఏరాల్, వేగేఁ యొరండి సేర్ తోనాఁ వా.'

కూఁతురు—బాబూ, పాలవాఁడు పాలు తీసికొని (వచ్చి) ఉన్నాఁడు. వాఁడు అనెను, 'ఎంత (ఎన్ని) పాలు ఇయ్యవలెు?' తండ్రి—పిల్లా, వానికి చెప్పుము, ఏమన, 'ఈనాఁడు ఒకసేరు పాలు చాలును. రేపు రెండుసేర్లు తీసికొని రమ్ము.'

ఇంతకుముందే ఉత్తర దేశమున ద్రావిడజాతులవారు పెక్కురు తమభాషలు వదలి, ఆర్యభాషలు మాటలాడు చున్నట్లు మనకు తెలియవచ్చినది. అంతేకాదు, మునుపు ద్రావిడభాషలుగా ఉండి, ఇపుడు ఆర్యభాషలప్రాబల్యమున ఆర్యభాషాకుటుంబమును చేర్పఁదగినటుల హాల్బి, లధాడీ, భరియాభాషలు మాఱిపోయినవి. ఇవి పూర్వము గోండి భాషతో సంబంధము కలిగియుండెను.

ఇటుల కొన్ని తెన్వంగడపుబాసలు రూపుమాసిపోయినను, కొన్ని ప్రత్యేకభాషలుగా లెక్కకురాకున్నను, ఈక్రింది భాషలు పదుమూఁడును మన తెనుఁగునకు తోఁబుట్టువులుగా వెలయుచున్నవి

గీ. తమిళ మలయాళములు, కన్నడమును గాక
కుడగు,తుళు, తోడ, కోటయు, కురుఖు, మల్తొ,
గోండి, కోఁదు, కోలామియు, కూర్బుతోడఁ
బుట్టువులు బ్రాహుఈ పల్కు పొలఁతితోఁడ.

ఇప్పటికి తెనుఁగుతోఁబుట్టువులనుగూర్చి కొంత తెలిసికొంటిమి. ఇఁక మన తల్లిభాష అగు తెనుఁగును గూర్చి కొంచెము ముచ్చటించుకొందము.

౧3. తెనుఁగు

తెనుఁగునాటిభాష తెనుఁగు. ఇది మాటలాడువారు సుమారు ౨ కోట్ల ఇరలక్షలమంది. తెన్వంగ డ పు భా ష

లన్నియు మాటలాడువారిసంఖ్య సుమారు ౨ కోట్లు. తెన్గం గడములో కొలుచువారి మొత్తమునుబట్టి తెనుఁగుపలుకు వెలందిరసే తొలిగద్దెను వెలయుచున్నది. తెనుఁగుతరువాతివి తక్కినమూఁడు ముఖ్యభాషలగు తమిళము, కన్నడము, మలయాళము. వాని తరువాతివి గోండి, కురుఖు, తుళు, కోఁదు, మల్తొ, బ్రాహూఈ, కుడగు, కోలామి, కోట, తోడ.

తెనుఁగు తెనుఁగునాటనే కాక భరతఖండములోని ప్రతిరాష్ట్రమునను తక్కువగనో, హెచ్చుగనో వాడుకలో ఉన్నది. అంతే కాదు, బర్మాలోను, బలూచిస్థానములోను, నేటాలు, మోరీసు, ఫిజీదీవుల మొదలగు చోట్లను కూడ తెనుఁగు మాటలాడువారు కలరు.

మనికిపట్టునుబట్టి చూచినను, తన తోఁబుట్టువులలో నెల్ల మన తెనుఁగుతల్లిదే మెఱుగగు నడిపట్టు. ప్రక్కపుటపటము పరికింపుఁడు; అది తేటతెల్లమగును. అయినను, ఏమి లాభము? ఇప్పటితనపట్టులు, పట్టుదలకలవారు కాక, పాలపొంగుతలంపులు కలవారే అగుటచే, మందిమొత్తపు హెచ్చు మెఱుంగు కాని - నడిమనికిపట్టు మెఱుంగు కాని - వారికి కలిగింపవలసినంత మేలు కలిగింపఁజాలక, కోఁతులచేతులలోని కొబ్బరికాయలగుచున్నవి. ఇప్పటికైన మనవారు పట్టుదలతో పనిచేయఁదొడఁగి, మేలొంద కడంగుదురా? తమకు తమమంచి పట్టకున్నను, ఇరుగుపొరుగువారలను చూచియేని తమమంచికి ఎట్లు పాటుపడవలెనో నేర్చుకొందురా? చూడవలె.

మొన్న మొన్నటివఱకును తెన్వాంగడపు పలుకులు మాటలాడువారిలో మిక్కిలి తెగువయు, కడఁకయు, కడిమియు చూపనోపినవారు తెనుఁగువారే. ౧౬, ౧౭ శతాబ్దులలో తమిళనాటిని లోఁబఱుచుకొని, ఏలుటయే కాక, హెచ్చుమంది — అన్ని వర్ణములవారును — అచ్చట స్థిరపడి, ఆయాజిల్లాలలో ఇపుడును లక్షలకొలఁది లెక్కకు వచ్చుచున్నారు. ఇప్పటికిని తెలఁగాలలో కొందఱకు వాడుకగుచున్న 'దొర' బిరుదుచిన్నె వారి తొల్లింటి దొరతనమును, దళవాయితనమును తెలుపునది కానోపు.

బర్మాలో తైలైంగు లనుపేర చిరకాలమునుండి నివసించుచు కొంతకాలము రాజ్యము నేలినవారును తెనుఁగువారే. క్రీస్తుశకారంభమునకు ముందే తైలైంగులు తెలంగాణమునుండి వచ్చిరని జీ. ఈ. హార్వేగారు బర్మా చరిత్రమున వ్రాసిరి. ఇది నిజమని బర్మాజాతుల చారిత్రము వ్రాసిన సర్ ఆర్థర్ ఫెయిరుగారును ఇయ్యకొనిరి. ఇపుడు తైలైంగులు తటోన్ ఆమహార్‌స్టు జిల్లాలలోను, తెన్నేశ్వరభాగములోను హెచ్చుగా ఉన్నారనియు, వారు బర్మాదేశాభివృద్ధికి సర్వవిధములను సాయపడిరనియు, బర్మాలోని ప్రాచీన మన్భాషా లిపి ప్రాచీనపు తెలుఁగులిపిని పోలియుండుటచే అది తెలుఁగువారివలననే వచ్చియుండు ననియు, బౌద్ధులగు తైలైంగులు బౌద్ధవిగ్రహములను తెలంగాణమునుండి తీసికొనిపోయి ప్రతి

ష్ఠించి రనియు, క్రీ. వె. ౮ శతాబ్దిని పెగూ సామ్రాజ్యమును తెలైంగులు పాలించినట్లు పెక్కు నిదర్శనములు కల వనియు, షిన అరహాఁనుడు తెలైంగులిపి ననుసరించి వ్రాఁతను ప్రారంభింపఁజేసె ననియు, క్రీ. వె. ౧౦౯౦ లో కట్టిన పగాను రాజ్యములోని 'ఆనందాలయము' బయట బుద్ధుని జాతక కథలు పాలీభాషలోను, తెలైంగుభాషలోను చెక్కఁబడి యున్నవనియు పగానుకు దక్షిణమున నున్న మ్యాజేడీగుడి సమీపమున చంజితునిపేర అతనికొడుకు ఒక రాతికంబము వేయించి, దాని నలువైపులను పాలీ, తెలైంగు, బర్మా, ప్యూభాషలలో శాసనములు చెక్కించెననియు మ రా. రా. శ్రీ కొట్ర శ్రీరాములుగారి బ్రహ్మదేశచరిత్రమువలన తెలియవచ్చును. తెలైంగుభాషయు తెనుగే కాఁదగును. దీనినిగూర్చి పరిశోధనము జరుగవలసియున్నది.

క్రీ. ము. తొలిశతాబ్దులలో ఇపుడు సుమత్రా, జావా అనుపేర్లతో ఒప్పు మలయద్వీపములకు వలసపోయి, అక్కడ స్థిరపడి, గుడులుకట్టి, రాజ్యము చేసినవారును తెనుఁగువారే. వారు కళింగమునుండి వెడలిపోయిరనుటకు వారికి అక్కడ వాడు 'క్లింగులు' పేరే పెద్దతార్కాణ. ఎన్నో వందలయేండ్ల క్రిందటినుండి సుమారు ౩౦ ఏండ్ల క్రిందటివఱకును తెనుఁగు వారియోడలు బేహారమునకు పెక్కు నాడులలోని రేవులకు పోవుచుండెడివి.

ఆంధ్రులకు మగధరాజ్యమును జయించుటలో తోడ్ప డినవారును, అచ్చట ఆంధ్రభృత్యులను పేర పరిపాలనను సలి పినవారును తెనుఁగువారే అయియుండఁదగు, ఇదియు పరి శోధింపవలసిన విషయమే.

ఇవేకావు తెనుఁగువారి తెగువకును, కడఁక కడు ములకును తార్కాణములు. క్రీ. ము సుమారు ౧౫౦ లో తెగువరులగు తెలుఁగువారు ఇప్పటి చిట్టిగాంగు (బంగాళము లోనిది), ఆర్కాను (బర్మాలోనిది) నాడు లో రాచఱికము చేసినట్లు తెలియవచ్చినది. చిట్టిగాంగే ఆర్యులు త్రిపుర దేశ మనిరఁట. ఇపుడు అది 'తిప్పెరా' అనుపేర బఱఁగుచున్నది. తిప్పెరాతోడ్లు పండుగులలో ఇప్పటికిని చేఁపతము పాకులు తమ వంగడపు గుర్తులుగా వాడుచుండుట మచ్చటగా ఉండు నఁట. విశాఖపట్టణముజిల్లాలోని మాడుగులరాజులు మత్స్యవంశమువారు, వారిగుర్తు చేఁప! ఈ మత్స్యవంశము వారి పూర్వులలో కొందఱు మునుపు తిప్పెరాకు వలస పోయి, అచట రాచఱికము చేయఁదొడంగిరని తలంపనగు.

అంతకుముందే తెలుఁగువారు కొందఱు నీటిమీఁది నుండియు, నేలమీఁదినుండియుకూడ ఇండో-చీనా దేశమునకు పోయి, అక్కడ వలస లేర్పఱుచుకొని, క్రీ. ము, ౧౧ శతా బ్దిలో రాచఱికము చేసినట్లు పేరే-కర్నలు గెరిని గార్ల అర యికవలన తెలియవచ్చుచున్నది!

చిట్టిగాంగు-ఆరకాను-ఇండో చీనా దేశములలో తెలుఁగువారు రాచఱికము చేయుట ఆంధ్రులు తెనుఁగునాట రాజ్యముచేయ మొదలుపెట్టుటకు కొన్ని శతాబ్దములకు ముందే అని మనవారు గుర్తింపనగు! ఆంధ్రులు ౨౫౦౦ ఏండ్లక్రిందట ఏలికలయిన, తెనుఁగువారు ౩౦౦౦ ఏండ్ల క్రిందటనే ఏలికలుగా ఉండిరి! నాఁటి తెనుఁగువారి తెగువయు, పట్టుదలయు తలంచుకొనువో, ఉన్నదికూడ ఊడఁగొట్టుకొనుచు-మేమును తెనుఁగువారము, తెలుఁగువారము, ఆంధ్రులము—అని చెప్పకొను మనము సిగ్గుపడవలదా? తెలివితెచ్చుకొనవలదా? క్రొత్తగా గడించుపని లేకపోయిన పోయెఁగాని, ఉన్నదయిన నిలువఁబెట్టుకొనుటకు కడంగనలదా?

"కృషి ప్రాచీనతలో నేమి, నుడులును - భాషీయము లును హెచ్చుగా కలిగియుండుటలో నేమి తెలుఁగు తమిళముతరువాత ఎన్నఁదగిన దని సాధారణముగా తలంతురు. ఇఁక పలుకుబడిబియ్యఁదనమున న్యాయముగా మొదట ఎన్నఁదగినది తెలుఁగే." అని కాల్డువెల్ పండితుఁడు నుడివె.

కాని "తమిళము ద్రావిడభాషాకుటుంబములో మిక్కిలి ప్రాఁతది" అనియు తలంచె కాని తరువాత పరిశోధకులు తెనుఁగు మొదలగు భాషలలో తమిళమునందు కలవాని

కంటె ప్రాచీన రూపములు కలవు కాన ఈ తలంపు సత్యము కాదనిరి.

తెనుఁగులోవలెనే ఆస్ట్రేలియా భాషలలోను, ఈశాన్య భాషలలోను బహువచనము ‘లు’ చేరుటవలన ఏర్పడును. ఇట్టి పోలికలనుబట్టి ద్రావిడ భాషలకును ఆ భాషలకును తొలుత సంబంధము కలిగియుండు నని కొంద ఱందురు. ఇట్లే తెర్వంగడపు భాషలకు ఫిన్నిషు (ఉగేరియన్) భాషతో మిక్కిలి దగ్గఱిసంబంధము కల దనిరి.

నీరు, ప్రాపు, గాలి మొదలగు కొన్ని తెనుఁగు నుడులను పోలు ఇంగ్లీషునుడులు కానవచ్చును. ఈ పోలిక ఎటుల వచ్చినదో! భాషాకృషి చేసిన కొలఁదిని వింతలును, సొగసులును బయలుపడును; పెట్టినమ్మకములు వెనుకపట్టును; నిజము పొడగట్టును.

## పేరు

భారతకవులలో మొదటివాఁడగు నన్నయభట్టు,

‘జనమతికృష్ణద్వైపా
యనముని వృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ
తెనుఁగున రచియింపు మధికధీయుక్తిమెయిన్’

‘సారమతిం గవీంద్రులు ప్ర
సన్నకథా కలితార్థయుక్తిలోఁ

సారె మేలు నా నిఘరు
లక్షిరమ్యత నాచరింప నా
నాగుబిరాగ్లుబ్లినిఫ
నన్నయభట్టు మంచునన్ మహా
భారతసంహితారచన
బంధురు దెన్గ్యా జగద్ధితంబుగన్ '

అను రెండుపద్యములలో తనభారతభాషను 'తెనుఁగు' 'తెనుంగు' అనియే పేర్కొనెను. భారతకవులలో రెండవవాఁడగు తిక్కన సోమయాజియు,

' హృదయాహ్లాది చతుర్థ మాశ్రితకథా
క్షేత్రంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట ను
ద్యోగాగములుం గూడఁ గాఁ
బగు నేనింకఁ దెనుంగుబాస జనసం
ప్రార్థ్యంబుగా జెంపునం
గుదిముట్టన్ రచియింతు దోస్ఫురిత సం
తోషంబు నిండారఁగన్ '

' తెనుఁగుబాస ననిర్మింపఁదివురు టరయ
భవ్యపురుషార్థతరుపక్వఫలము గాద
దీని కే నియ్యకొని వేడ్క మూని కృతిప
తిత్వ మర్థించి వచ్చితిఁ దిక్కశర్మ '—

అను రెండు పద్యములలో తనభారతభాషను 'తెనుంగు', 'తెనుఁగు' అనియే పేర్కొనె కాన మనభాషకు నన్నయ

నాఁటి పేరు 'తెనుఁగే' అనియు, తిక్కననాఁటికిని దానివాడుక బాగుగనే ఉన్నదనియు కానవచ్చును.

కాని తెనుఁగునాటి భాషకు 'తెనుఁగు' నుడి ఒకటియే కాదు పేరు. 'తెలుఁగు' అని మఱొకపేరు కలదు. ఇప్పుడు హెచ్చుగా ఇదే వాడుకలో ఉన్నది.

అయినను 'తెనుఁగు' 'తెలుఁగు' అను రెండు పేర్లే కాక తెనుఁగువారును పైవారునుకూడ వాడుచున్న యింకొకపేరు సైతము తెనుఁగునాటి భాషకు వచ్చినది. అదే 'ఆంధ్రము'. ఈ పదము దక్షిణదేశభాషాకుటుంబమును తెలుపు. కుమారిల భట్టు 'ఆంధ్రద్రావిడ భాషా' అనుసమాసమున ఆంధ్ర దేశ భాషను తెలుపుటకు వాడె. అతఁడు ౭-వ శతాబ్దివాఁడో, ౮-వ శతాబ్దివాఁడో అనుచున్నారు. కాన అప్పటికే తెనుఁగునకు ఆంధ్రనామము వచ్చినటుల తేటతెల్లమే.

పిదప తిక్కనసోమయాజి తన విరాటపర్వమున,

'ఆదరణీయసారవివి
ధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణ
సంభృత మై పెనుపొందియుండ, నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు
లాంధ్ర కవిత్వవిశారదుండు, వి
ద్యాదయితుండు నన్నయభట్టు దక్షతన్.'

అనుపద్యములో ఆంధ్రశబ్దము నన్నయభారతభాషను తెలుపుటకు వాడియున్నాఁడు. అది ఇపుడును తెనుఁగు తెలుఁగు నుడులకు పర్యాయపదముగా వాడుచున్నారు. ఇందులకు ఆంధ్రరాష్ట్రము, ఆంధ్రోద్యమము, ఆంధ్ర సాహిత్య పరిషత్తు, ఆంధ్రవిశ్వ విద్యాపరిషత్తు మొదలగునవి ఉదాహరణములు. ఇట్లు తెనుఁగునాటి భాషకు తెనుఁగు, తెలుఁగు, ఆంధ్రము - అను మూఁడు నుడులు పేరులైనవి.

ఈ మూఁడు పదములకును పలువురు వ్యుత్పత్తి తెలుప యత్నించినారు. అందు ఆంధ్రశబ్దము సంస్కృతము. కాన, దాని వ్యుత్పత్తితో మన కిట పనిలేదు. కాని తక్కిన నుడుల వ్యుత్పత్తియు, ఆంధ్రశబ్దము మనభాషకు పేరైన విధమును తెలిసికొనుట అత్యావశ్యకము.

తెనుఁగు తెలుఁగు నుడులకు వ్యుత్పత్తి చెప్పుటలో తెలుఁగునుడినే ముఖ్యముగా తీసికొని మొత్తముమీఁద హెచ్చుమంది పండితులు త్రిలింగశబ్దభవ మనుకొని తనిసినారు. అది సరికాదు. త్రికళింగశబ్దభవమని కొందఱు మఱొక వ్యుత్పత్తి చెప్పినారు. ఇఁక తెనుఁగునుడి తెలుఁగునుడికి రూపాంతర మనియు, త్రినగశబ్దభవ మనియు తలంచినారు. పండితులు కొందఱు దానికి తేనెవలె తియ్యనిది అని వ్యుత్పత్తి చెప్పినారు అయినను పైవ్యుత్పత్తులు కొందఱకు సంతృప్తి కలిగింపలేకపోయె. అందు ప్రతిభాశాలులును, పూజ్యులును,

మాకవితాసమితి సభ్యులును, ఇపుడు కీర్తిశేషులు నగు మహోపాధ్యాయ ఆచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు చక్కఁగా పరికించి తణుకులో జరగిన ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక సభాధ్యక్షపీఠమునుండి తెలుఁగునుడి దేశ్యమే కాని త్రిలింగశబ్దభవము కా దనియు, అందలి తొలినుడి తెల, తెలి మొదలగు నుడులలో ఒకటి కాదఁగు ననియు నొక్కి వక్కాణించియుండిరి. తెనుఁగునుడులకు వ్యుత్పత్తి లేదను సంస్కృత పండితులమాట చిన్ననాఁట నా చెవులఁ బడినప్పటినుండియు అది నామదికి నచ్చక తెనుఁగునుడులకుమాత్ర మేల వ్యుత్పత్తి ఉండదు? తప్పక ఉండవలె. అనునమ్మకమున వానికి కొన్నింటికి వ్యుత్పత్తి అరయుచున్నవాఁడ నగుటచే సాంఖ్యాయనశర్మగారి తెలుఁగునుడివ్యుత్పత్తి చదివినపుడు నాకు కలిగిన సంతోష మింత యని చెప్పవలంతిని కాను. నాసంతోషమునకు కారణము చిరకాలమునుండి తెలుఁగునుడికి వ్యుత్పత్తి చెప్పుతప్పుదారి తప్పించి మహోపాధ్యాయులవారు సరియైన దారి చూపుచు తెనుఁగునాటిభాషకు పేరగు దాని వికృతిత్వమును పాపి స్వతంత్రతయు, మన్ననయు సమకూర్చి తెనుఁగు పలుకువెలఁదిని గద్దెమీఁది కెక్కించుటయే. గద్దె ఎక్కుటకు ఫల మిట్టుకదా ఉండవలె.

తెలుఁగులోని తొలిముక్క సాంఖ్యాయనశర్మగారు సూచించినట్టిదే కానోపునని నేనును తలంచుచుంటిని. కాని

డాని నిండురూపె ట్లేర్పడినదో సరిగా తెలుపుటకు వీలుకలు గమిచే అది అప్పటికి బయలుపెట్టక ఊరకుంటిని. శర్మగారు తెలుఁగునుశిలోని తొలిముక్క సూచించి నిండురూపము ముదుఁగు మొదలగువానికివలె వచ్చియుండునని తెలిపిరి. దీని వ్యుత్పత్తిని గూర్చి పండితాభిప్రాయములు కొన్ని కనుంగొనఁ దగు :

ఆంధ్రభాషాతత్త్వకృతికర్తలు కీ. శే. పాడి వేంకట నారాయణశాస్త్రిగారు "కొందఱు తెల్ల + అగు=శుభ్రమైన దగుటచే తెలుఁగు అనిరి కాని అది పండితజన పరిష్కృతంబు కామింజేసి భాషాతత్త్వవేత్తలు సమ్మతింపరని వ్రాసిరి. తెనుఁగునుడికి చెప్పిన వ్యుత్పత్తులను గూర్చియు ఇట్లే అనిరి.

భరతఖండభాషలసర్వే అనుగ్రంథము వ్రాసిన జి. ఏ. గ్రీర్సన్‌పండితుఁడు ఆంధ్రపదమునకు మాఱుగా ఆర్యులు త్రిలింగపదము వాడుటకు కారణము తెలుఁగునుడి గ్రహించుట అనియు, ఆనుడి ప్రాకృతద్వారమున 'తేలింగ' అను రూపున కైకొనియుండవచ్చుననియు, దానిమూలము 'తెలి' యు, 'ంగ' ప్రత్యయమును కాఁదగు ననియు, 'తెలి', 'తెలియుట' తెలుఁగున కల వనియు తెలిపె, ఈవ్యుత్పత్తి సరి అయిన దనుట నిరపాయము కా దని తలంచిరి. తుదకు ఏవ్యుత్పత్తియు అంగీకరింపమియే మే లనిరి.

కన్నడిగలు-తెలుగలు అనువ్యాసము వ్రాసినవిద్వాన్ కూరిగనూరు నరసింగరావుగారు తెల్ల + అగు, తెల్ + అగు అని తెలుఁగునుడిని విడఁదీసిరి.

ద్రావిడభాషలు—అనుపొత్తము వ్రాసిన విద్వాన్ గం. జో. సోమయాజిగారు, తెలి + అగు అను వ్యుత్పత్తిని గ్రహించిరి

ఇఁక నాకు తోఁచినది విన్నవించువాఁడ. తెనుఁగు-తెలుఁగు నుడులలోని తుదిముక్క 'అగు' కాదనియు, అది ప్రత్యయము కాఁదగు ననియు నాకు తోఁచె. కాని అది ఏ ప్రత్యయమో సరిగా తెలుపుటకు ఆధారము కానరాకుండెను. కీ. శే. లింగము లక్ష్మోజీపండితుని కోఁదువ్యాకరణము చదువునపుడు బహువచన ప్రత్యయములలో 'ంగి' ఒకటిగా కనఁబడె. పిదప గోండీభాషనుగూర్చి 'ఐందవభాషల సర్వే' నాల్గవసంపుటములో చదువుచో బ. వ. ప్రత్యయములలో 'ంగ్' ఒకటిగా కనఁబడె. అపుడు కోఁదుగోండీలలోని బ. వ. ప్రత్యయములగు 'ంగి' 'ంగ్' లకు తెనుంగు-తెలుంగు నుడులలోని 'ంగు'తో సంబంధము తప్పక ఉండు ననుకొంటిని. అయినను తెలుంగులోని తొలిముక్క 'తెల' అనుకొని దానికి పైకోఁదుగోండీల బ. వ. ప్ర. లు చేర్చినచో తెలంగ-తెలంగ్ అనురూపములు వచ్చును గాని 'తెలుంగు' అను రూపు రాదు. అయిన నేమి? ఈ 'తెలంగ-తెలంగ్' రూప

ములును మనకు కావలసినవే; వీనివ్యుత్పత్తి తెల్లనివారు అని తేలును. దీనికి త్రిపురానవారికుటుంబ మొకటి తార్కాణ. తెలంగ్ నుడి చాంబాయిలోని తెలుఁగుకుటుంబమువారు తమ పేర్ల తుదను వాడుట మనకు తెలిసినదే. (శబ్దరత్నాకరమును, పురుషోత్తమకవీయమును తాము వైకృతముగా గ్రహించిన 'తెలంగ'నుడిని నిర్బిందుకముగా తెలగా, తెలగ-అని వాడె!) ఇవిగాక తెలంగాణము (ఆణెము అని ఆంధ్రభాషార్ణవము), తెలఁగాణ్యులు, తెలఁగాణీయము అను నుడులు కలవు. వాని కివి వ్యుత్పత్త్యర్థము వరుసగా తెలఁగలదేశము, తెలంగాణపు బ్రాహ్మణులు, తెలఁగాణీతనము అని వచ్చును. కాని తెలుఁగునుడినిగూర్చి ఏమియు తేలలేదు. అందుచే దానిని గూర్చి పరికింపఁగా, తెల + ఉన్ + ంగ్-కలసి 'తెలుంగ్' అయి, ఇప్పటి పలుకుబడినిబట్టి 'ఉ' చేరఁగా 'తెలుంగు' అనునుడి ఏర్పడియుండు నని తోఁచె; దానికి తెల్లగాఉండువారు, అట్టివారిభాష తేటగా ఉండునుడులభాష అని అర్థములు వచ్చును. తేటతెలుఁ గనువాడుక అందఱకును తెలిసినదే కదా! తెలుఁగునుడివ్యుత్పత్తినిబట్టి భాషాగుణము తెలియ వచ్చుచున్నది గాన ఇది తెనుఁగునాటి భాషకు తొలిపేరు కా దనియు, తరువాత వచ్చిన పే రనియు నాతలంపు.

తెనుఁగునుడి తెలుఁగునుడికి రూపాంతర మనుటతో నేను తనియఁజాలకపోతిని. వన్నయతిక్కనలు వాడిన తెనుఁ

గునుషి రూపాంతరమును, అముఖ్యమును గాక స్వతంత్ర మును, ముఖ్యమును అనియు, మనభాషకు మొదటిపేరనియు నానమ్మకము. ఉనికిని తెలుపుపేరు గుణమును తెలుపు పేరు కంటె మొదటి దగుట సహజము కదా! అందుచే దీనిని గూర్చియే నేను మొదట అరసితిని, అది విశదపఱచితి; తెన్ + ఉన్ + ంగ్ + ఉ-కలసి ఏర్పడిన దని తేల్చుకొంటిని. అయిన ఈవ్యుత్పత్తినిబట్టి అర్థ మే మందురా? తెన్నున (దారిలో) ఉండువారు, వారిభాష. తెన్నున ఉండువారి దేశము తెనుఁగు నాడయ్యె. ఈ తెనుఁగునాడే ఆర్యుల దక్షిణాపథము. తెనుఁగు నాటికి 'తెనాలము' అనుపేరు ఉండినట్లు తెనాలి తెలుపు చున్నది. దక్షిణాపథము, దక్షిణదేశము నొకదానిని తెలుపు ననుటకు భారతారణ్యపర్వమున నలుఁడు దమయంతితో అని నట్లు తెలుపునట్టి యీక్రిందిపద్యమే నిదర్శనము:

> " ఇది దక్షిణాపథంబున
> కిదియూ విదర్భాపురమున కిది కోసల కి
> య్యది యుజ్జయినికిఁ దెరువులు
> మది నిన్నిటిలోన నరుగ మన కెద్ది యగున్? "

ఇఁక ఆంధ్రము తెనుగుభాషకు పే రెట్లయ్యె? ఆంధ్ర శబ్దము భాషనే కాక జాతిని, దేశమునుకూడ తెలుపుచున్నది. ఇది సహజముగా మొదట జాతికిని, పిమ్మట భాషకును, అటు పిమ్మట దక్షిణమున ఒక దేశమునకు పేరై ఉండవలె. ఆంధ్రులు

తరువాత తెనుఁగువారితో కలసిపోయినను మొదట ఆర్యజాతి వారయినటుల ఐతరేయ బ్రాహ్మణమువలన తెలియవచ్చుచున్నది. వారిభాష ఆంధ్రమును ఆర్యభాషలలో ఒకటి అని వేఱే చెప్పనక్కఱలేదు. ఆంధ్రులు తొలుత అనాగరకులును, బలహీనులు నైనను కొంతకాలమునకు బలవంతులై, రాజులై తెనుఁగునాటి నాక్రమించుకొని పాలించుటచే అదియు ఆంధ్రదేశమయ్యె. ఆంధ్రులు కొలఁదిమంది అగుటచే వారిభాష తెనుఁగువారిభాషతో కలసిపోయినది. ఇట్లు ద్రావిడముులోని తెనుఁగుభాషయును, ఆర్యభాషాకుటుంబములోని ఆంధ్రమును కలసి యేర్పడిన మొత్తముభాషకు తెనుఁగు, తెలుఁగునుడు లే కాక ఆంధ్రపదముకూడ పేరయ్యె. ఇందువలన తెనుఁగు నాటి తొలిభాష తెనుఁగే కాని ఆంధ్రము కాదనుట తేటతెల్లము. తెనుఁగులో చేరిన ఆంధ్రపదములు కొలఁదిమంది మాటలాడునవియు, కొలఁదిసంఖ్య కలవియు అగుటచే, హెచ్చుమంది మాటలాడునట్టియు, హెచ్చుసంఖ్య కలిగినట్టియు తెనుఁగునుడులను అణఁచివేయఁజాలక, ఒక ప్రాకృత భాషకు చెందిన వగుటచే సంస్కృత సమ సంస్కృతభవముల వలె ప్రాకృతసమ ప్రాకృతభవములుగా దేశభాష అగు తెనుఁగుతో కలసి తెనుఁగునుడుల వ్యాకరణ నియమములకు లోనై తమవ్యక్తిత్వమును పోఁగొట్టుకొనినవి కావున ఆంధ్రము-ఆర్యభాష - తనయం దభిమానముగలపండితులు వ్రాసిన

గ్రంథములలో తెనుఁగు తెలుఁగు నుడులతోపాటు తానును తెనుఁగునాటిభాషకు పేరు కానోపినను నిజమునకు తెనుఁగు తెలుఁగునుడులకున్న హక్కు తనకును ఉన్నట్లు చెప్పుకొనఁగలది కాదు. అయినను ఆంధ్రపదము తనభాగ్యబలమున, అనఁగా తనయందభిమానముగల వారి తోడ్పాటుచే తెనుఁగు తెలుఁగునుడులకు తానే కొక్కుపెట్టఁగలుగుచున్నది! తెనుఁగువారికి తమ తల్లిభాషయందు తగినంత మన్ననలేమిచేతనే కదా ఇటులు జరగుట!

పైమూఁడుపేర్లనుగాక మనభాషకు మఱి రెండు పేర్లు కలవు. అందు మొదటిది వడుఁగు, ఇది తమిళులు తమకు ఉత్తరపుదిక్కున ఉండుటచే మనభాషకు పెట్టినపేరు, దీని అర్థము ఉత్తరపుదిక్కునఉండువారిభాష. రెండవది గెంటూ, ఇది పోర్చుగీసువారివలన వచ్చినది; దీనిఅర్థము క్రైస్తవేతరులగువారి భాష.

## మాటలాడుప్రదేశము

చెన్నరాష్ట్రములో గంజాము మొదలు సేలముతుదిగా ఉండుజిల్లాలును, నైజామురాష్ట్రములోని తూర్పుజిల్లాలును, మైసూరుసంస్థానమున కోలారుజిల్లాయును, మధ్యరాష్ట్రములలో చాందాజిల్లాయును, బస్తరుసంస్థానమును, బీరారులోని కొంతభాగమును, బీహారురాష్ట్రములో కొలఁది భాగమును,

కటకమును, జగన్నాథమును, ఒరిస్సాసంస్థానములలోని కొన్ని భాగములును, బంగనపల్లి, సాందూరు సంస్థానములును తెనుఁగు స్వదేశమున స్వభాషగా మాటలాడు పట్లు. ఇవిగాక భరతఖండమున వివిధభాషలు మాటలాడు ప్రదేశములలో సుమారు ౨౦ లక్షలమంది నివసించువోట్లు కలవు. అందు తమిళనాటను సుమారు ౧౮ లక్షలమంది ఉండు తావులు కలవు. వీరు తెనుఁగునాయు రాజ్యము లేలుచు-దండయాత్రలు చేసెడు కాలమున అచ్చట నిలిచిపోయినవారి సంతతివారు.

## ఎల్లలు

తెనుఁగునకు దక్షిణమున తమిళ కన్నడములును, పడమట కన్నడమరాటీలును, ఉత్తరమున మరాటీ, గోండీ, హాల్బి, ఓఢ్రము—అను భాషలును ఎల్లలు.

## ఉపభాషలు

మాటలాడుభాషయు, గ్రాంథికభాషయు వేఱుగా ఉండును గాన ఇవే ముఖ్యములగు ఉపభాష లనఁదగు.

చాందాలోని తెనుఁగు కోమ్‌టీ, సాలేవారీ, గోలరి అను పెక్కు పేర్లతో వాడుదురు. బెల్గాములోని తెనుఁగు బేరడీ, దాసరీ అను పేర్లతోను, బొంబాయిలోని తెనుఁగు కామాఠీ అనుపేరను, బొంబాయిరాష్ట్రములోను - బీరారు లోను - మఱికొన్ని జిల్లాలలోను తిమ్మరువారు వాడు తెనుఁగు

వహరీ అనుపేరను పరఁగుచున్నది. కాని వీని అన్నిటి యందును పలుకుబడిలోఁగాని, నుడులమూర్పులలోఁగాని ఉన్న భేదము అంత హెచ్చు కామిచే ఇవి ఏవియు ఉపభాష లన వీలు లేదు.

## వ్రాత - అచ్చు

క్రీ. శ. ౭ వ శతాబ్దిని చీనాయాత్రికుఁడు యువాన్ చాంగు మన దేశమునకు వచ్చినపుడు ఆంధ్రులకు ప్రత్యేక భాష కల దనియు, అది ఉత్తరదేశలిపికి దగ్గఱగా ఉండు లిపిలో వ్రాయుదు రనియు తెలిపె

పోర్చుగీసువారు తెలుఁగువారినిగూర్చి వ్రాసినట్లు తెలియవచ్చును. కాల్డువెల్ పండితునికి సీ. పీ. బ్రౌనుదొర గారు వ్రాసి యిచ్చినచీటినిబట్టి గుంటూరునాటిలోని తొలి ఫ్రెంచిమిషనరీలు తెలుఁగునిఘంటు వొకటి వ్రాసినట్లు తెలియవచ్చును. ప్యారిసులోని జాతీయ గ్రంథాలయములో తెనుఁగువ్యాకరణములును, నిఘంటువులును కలవని కొంద అందురు. విదేశస్థులు పలువురు తెనుఁగునుగూర్చి వ్రాసిరి, తెనుఁగు చదువుకొనిరి.

౧౮౦౭ సం. రమున తెలుఁగువ్యాకరణ మొకటి మొదట అచ్చుపడె. ౧౮౧౮ సం రమునుండి నిఘంటువు లచ్చు పడ మొదలిడినవి.

## వాఙ్మయము

ప్రాచీనతనుబట్టి తెనుఁగు వాఙ్మయము మూఁడవదిగా లెక్కకు వచ్చుచున్నది. దీనికి కారణము తొంటి తెనుఁగు నందలి బౌద్ధజైన గ్రంథములు నశించుట కానోపును. కాన చీనా, టిబెట్టు, బర్మా, సింహళ గ్రంథాలయములలో ప్రాచీనములగు తెనుఁగు గ్రంథము లేవైన దొరకునేమో పరిశోధింపవలసియున్నది. ఇంతేకాదు. తొలి తెనుఁగు శాసనములును, తమిళకన్నడ వాఙ్మయములును కూడ పరికింపఁదగు.

తెనుఁగువాఙ్మయము తొలుత హెచ్చుగా పద్యమయము. నానాఁటికి గద్యభాగమును హెచ్చుచున్నది. సాధారణముగా పద్యకావ్యములను వానిలో కేవల నిర్వచన కావ్యములలోను, శతకములలోను తప్ప తక్కినవానియందు వచనములు కలవు. ముఖ్యగ్రంథముల భాష గ్రాంథికభాషయే. వాడుకభాషలో కూడ కొన్ని గ్రంథములు కలవు. ఇపుడు వాఙ్మయము రెండుభాషలలోకూడ పెంపొందుచున్నది. పురాణములు, ప్రబంధములు, శతకములు, నాటకములు, చరిత్రములు, నవలలు, యక్షగానములు, పదములు, పాటలు మొదలగు పెక్కు తెలుంగుల గ్రంథములు కలవు. కాని తెనుఁగువాఙ్మయము మహాభాష లని పేరొందిన సంస్కృతము, ఇంగ్లీషు మొదలగుభాషలలోని వాఙ్మయములవలె సంపూర్ణ మయినదని తెనుఁగువారు చెప్పుకొని, సంతోషింపఁజాలని స్థితిలో

ఉన్నది. ఈకొఱంత తీర్ప కొందఱు ప్రయత్నించుచున్నారు. ఋగ్వేదమును, ఉపనిషత్తులు కొన్నియు తెనుఁగులోనికివచ్చినవి. కుఱలు తెనుఁగురూపుతాల్చినది. ఇటుల పైభాషలలోని ఉత్తమగ్రంథములు తెనిఁగింపఁబడుటకు తెనుఁగువారు కొంతవఱకు అలరఁదగు; కాని తమవాఙ్మయము సర్వవిధములఁ సంపూర్ణమగుదనుక తనియరాదు. మాతృభాషకున్న కొఱంత తీర్చుటకు వలయుప్రయత్నము ముఖ్యముగా చేకొనక కొందఱు కొంతకాలమునుండి గ్రామ్యగ్రాంథికవాదములలో నిమగ్నులయియున్నారు. ఇది తెనుఁగునోఁచిన నోముపంటకొఱంత కానోపు. ఇప్పటికైన తెనుఁగుతల్లిబిడ్డలలో వలంతులగువారలెల్లరును కలసి పనిచేసి, తమవాఙ్మయములోపమును తీర్చుకొన పూనుకొందురుగాక!

మఱొకమాట. భాష నానాఁటికి మాఱుచుండుట పండితులకు తెలిసినవిషయమే. భాష మాఱునప్పుడు నియమములు మాఱకుండు టెట్లు? అంతియకాదు. కాలము కడచిన కొలఁదిని, లోకముతోడిపొత్తు హెచ్చినకొలఁదిని తలంపులును మాఱును, రుచులును మాఱును. ఇతరవాఙ్మయములు చదువువారికి అందలిగుణములు తట్టును; తమవాఙ్మయము దోషములు పొడకట్టును. అట్టివారు తాము వ్రాయుగ్రంథములు పూర్వనియమములకు పూర్తిగా లోఁబడి వ్రాయఁజాలరు. ఇతరభాషావాఙ్మయములు చదువనివారికి పూర్వ

నియమములే గుర్తింపవచ్చును. పూర్వులలో సైతము నియమ
విషయమున అభిప్రాయభేదము లేదన వీలు లేదు. అభి
ప్రాయభేదము సజీవజాతిలక్షణము. అది మన్నింపదగినదే.
కాని దానినిగూర్చిన వాదప్రతివాదములతో కాలక్షేపము
చేయక, తాము తెలుపదలంచు విషయము చదువువారిమదిని
కుదురుగా నాటునటుల చేయజాలు శైలిని మనవారు స్వతం
త్రములగు గ్రంథములు వ్రాసినగాని, తెనుగువాఙ్మయము
పరభాషాపండితులదృష్టి తనవైపునకు త్రిప్పుకొనజాలదు,
తనలోటు తీర్చుకొనజాలదు, మహాభాష కాజాలదు.
కావున భాషాభిమానులు సాహిత్యగ్రంథము లేమి,
లక్షణగ్రంథము లేమి, చరిత్రలు మొదలగుగ్రంథము లేమి
ఆయావిషయములలో బాగుగా కృషిచేసి, రసగలశైలి
నసిగా వ్రాసి, తమ తెనుగు వాఙ్మయమునకును, తమకును
వన్నెవాసులు సమకూర్చుకొందురుగాక!

వాఙ్మయమునకు చాలా కాలమునుండి వ్రాత పట్టు
కొమ్మగా ఉన్నమాట నిజమే. కాని వ్రాత లేకున్న వాఙ్మ
యమే ఉండదనుకొనరాదు. వ్రాత వ్రాయను చదువను నేరని
వారు వేదమును, పాటలును, పద్యములును నేర్చుకొనుట
ఎల్లరకును తేటతెల్లమే. అంతియ కాదు. వచనమును ఒకరు
చెప్పగా చెప్పుకొని కంఠస్థముచేసికొనుటయు కలదు. ఇట్టివో
వ్రాతలేనియెడ సైతము వాఙ్మయము ఉండుననుకొనుట సందే

హాస్పదము కానేరదు. కాన తెనుగు వాఙ్మయము పాటలతో ప్రారంభ మయ్యెనని తలంపనగును. కాని తొల్లింటి తెనుఁగు పాటలు వేదాదులవలె ఇప్పటికిని నిలిచియున్న వని తెలుపుటకు తగినబలిమి చేకూర్చు ప్రాపేమియు కానరాదు.

తెనుఁగునకు రావణాదులు తొలుత వ్యాకరణములు వ్రాసినటుల తెలియవచ్చును. లంకాధినాథుఁడు రావణుఁడు పండితుఁడగుట నిస్సంశయము. అతనికి జనస్థానము క్రొత్తది కాదు. అది తెనుఁగునాటిలోనిదే కదా! అందుచే అతఁడు తెనుఁగు సొంపునకు సొగసి దానికి వ్యాకరణము వ్రాసెనేమో! వ్రాసినను అదికాని, తక్కినవారి వ్యాకరణములుకాని ఇపుడు కానరామిచే ఈ విషయమువలన ప్రయోజన మంతగా కానరాదు. అయినను ఇందువలన తెనుఁగు ప్రాచీనమని మాత్రము స్థిరపడును.

మతమునుబట్టి చూచినచో తెనుఁగువారు మొట్టమొదట గ్రామదేవతలను, నాగులను కొలుచుచుండెడి వారు కానోపుదు రని తోఁచును. ఆ పూజలే ఇప్పటికిని తొల్లింటి తెనుఁగువారి సంతతివారు ముఖ్యముగా చేయుచున్నారు. పిదప తెనుఁగునాటను బౌద్ధజైన మతములు వ్యాపించినవి. ఆ పిమ్మట బ్రాహ్మణమతము వానికి పోటీగా వచ్చి, పుడమిఱేడుల ప్రాపుచేతను, మతగురువుల పలుకుబడిచేతను వానిని రూపుమాపి, తాను పాదుకొనినది. అందుచే తెనుఁ

గులో బ్రాహ్మణవాఙ్మయమునకు పూర్వమున్న బౌద్ధజైన వాఙ్మయమును బ్రాహ్మణమతాభిమానులు నశింపఁజేసిరేమో! అని తలంప వీలు కలుగుచున్నది. జైనుఁడనుకొను అథర్వణుని భారతము నశింపఁజేసెనను నింద నన్నయభట్టునకు వచ్చుట ఈ సందేహమునకు బలము కలిగించుచున్నది.

ఇప్పు డున్న తెనుఁగువాఙ్మయము మొత్తమమీఁద బ్రాహ్మణవాఙ్మయమే. ఇది నన్నయనాఁటి నుండి (౧౧ వ శతాబ్ది) పెంపొందినది. జైన వాఙ్మయము కన్నడమున గా, ౧౦ శతాబ్దములనుండి ౧౩ వ శతాబ్దివఱకును వెలసినట్లు తెలియ వచ్చును. అందుచే ఆకాలముననే తెనుఁగునందును జైన కవులు గ్రంథములు వ్రాసియుండనగు. "జైనుఁ డని మన మనుకొనుచున్న యథర్వణుని గ్రంథభాగములు, పద్మకవి పేరు, ఆది జినేంద్రపురాణముల నామములు, కవిజనాశ్రయ మును మనకు వారికాలమునాఁటి మనవాఙ్మయసమూహము నందు మిగిలియున్న చిహ్నములు" అని ఆంధ్ర వాఙ్మయ చరిత్ర నుడివినది. మ. రా. రా. వేమూరి విశ్వనాథశర్మగారు కుంభకోణ కలాశాలలో పనిచేయునప్పుడు ప్రయత్నింపఁగా 'త్రైలోక్యశతకము' అను సీసపద్యముల శతకము, తాటాకులమీఁద వ్రాసినది, మొదలును తుదియునులేనిది దొరకినది. అందలి పద్యములు కాంచీనగర ప్రాంతమందలి జైనులు తమ పిల్లల కిప్పుడును చెప్పి కంఠస్థము చేయింతు

రఁట. ఇది యెప్పటిదో తెలియదు. అంత ప్రౌఢమును కాదు. కాని తెనుఁగున కవిత్వము చెప్పజైనులు కొంత కాలము క్రిందట ఉండెడివా రనియు, జైనులు బ్రాహ్మణమతాభి మానులగు రాయిడికి తాళఁజాలక తెనుఁగునాడు వదలిపోయి రనియు తెలుపుటకు తార్కాణగా ఉన్నది. తెనుఁగుజైన కవుల గ్రంథములగతియే ఇట్లున్నపుడు తెనుఁగు బౌద్ధకవుల గ్రంథములనుగూర్చియు, అంతకుముందటి తొల్లింటి అచ్చ తెనుఁగు వాఙ్మయమును గూర్చియు చెప్పఁగలది ఏమి ఉండును? అయినను ఆంధ్రభాషయందు చీనాలిపిలో వ్రాసిన శ్రీపీఠిక మను ప్రాచీనగ్రంథ మొకటి కలదని తెలియవచ్చినది. కాని ఈ ఆంధ్రము తెనుఁగో, ప్రాకృతమో మొదట కనుఁగొనవలె. తెనుఁ గయినచో ఆ గ్రంథము సంపాదించి పరికింపవలె మఱియు బర్మా దేశమున తెలైంగు భాషలో వ్రాసిన గ్రంథము లేవైన దొరకు నేమో ప్రయత్నింపవలె. ఇంతకు తెనుఁగున వ్రాసిన జైనబౌద్ధకవుల గ్రంథములు గాని, తెలైంగు గ్రంథములు గాని గడింపఁగలుగుట కడిందిపనియే. ఏమతము తోడను పోటీ లేనికాలమున వ్రాసిన తెనుఁగు బ్రాహ్మణ వాఙ్మయములోని గ్రంథములే ఎన్నో ఇపుడు కానరానివో తక్కినవాని మాట చెప్పనేల? అయినను జతనముతో సాటి మఱొకటి లేదు గాన ప్రయత్నించుటయే మనకు పాడి. ఫలము కలుగిదేమో అని మిన్నకుండరాదు. కనుఁడు తెల్లవారి

కడంక! అది మనకు ఒజ్జబంతి కాఁదగు. కాని అదేమి పాపమో! వారిచెడ్డయే మనకు పట్టుపడుచున్నది గాని మంచి పట్టుపడకున్నది. చీడ అంటినట్లు సిరి అంటదు కదా!

తెనుఁగువాఙ్మయము సంపూర్ణము కాకున్నను తెనుఁగు మహాభాష అనిపించుకొను భాగ్యమునకు ఇప్పటికి నోఁచుకొనకున్నను, అమరకోశపద్ధతి ననుసరించి వ్రాసిన 'ఆంధ్ర భాషార్ణవము' అను నిఘంటువును, కష్టమైనను సంస్కృత సమపదములను వదలివేసి వ్రాసిన అచ్చతెనుఁగుకావ్యములను, తెనుఁగునుడులే హెచ్చుగావాడి పసలించు మేలిశైలిని వ్రాసిన తిక్కనాదుల కావ్యములును, అనేకార్థముల కావ్యములును, తమిళనాటి పాటకాండ్రకు పట్టుకొమ్మలై విను వారికి వీనులవిందులై గాంధిమహాత్ముని ప్రార్థనసమయమున సైతము పాడఁబడు త్యాగరాజకృతులును, తెనుఁగు వాఙ్మయపునగలో మెచ్చఁదగు పనివానితనముతో వన్నె కెక్కు పట్టులనియు, దాని మేలిచిన్నెలనియు నొక్కి వక్కాణించి, తెనుఁగువారు కొంతవఱకు తనియవచ్చును.

## తుదిమాట

ఇప్పటికి భాష, భాషాకుటుంబములు, తెన్వాంగడము, తెనుఁగుతోఁబుట్టువులు, తెనుఁగు-అను విషయములనుగూర్చి కొంత ముచ్చటించుకొంటిమి. తెనుఁగువాఙ్మయపు లోటు తీర్పఁదగు ననుకొంటిమి. పసగల మేలిశైలిని గ్రంథములు

వ్రాయనలయు ననుకొంటిమి. కాని అట్టిశైలి అబ్బుటెట్లు ?
దానికి తెనుఁగు సరిగా నేర్చుకొనవలె ... అనఁగా తెనుఁగు
నుడుల నిక్కపురూపులును, అర్థములును, సామెతలును, సొగ
సులును తెలిసికొనవలె; నుడులు కూర్చునేర్పు సమకూర్చు
కొనవలె. లేనిచో మదిలోనితలంపులను సూటిగా వెల్లడించు
పసగలమేలిశైలి పట్టుపడదు, అది లేనిచో మన వాఙ్మయము
వన్నెకెక్కదు; లోకమునకు పనికిరాదు. అట్టిచో మనకు
వాఙ్మయము ఉన్నను లేకున్నను ఒక్కటియే. కాఁబట్టి తమ
వాఙ్మయము లోకమునకు పనికివచ్చునట్లు పెంపొందింపఁ
దలఁచు తెనుఁగువారు తెనుఁగున మంచిపాండిత్యము గడించు
కొనవలె. కాని మంచిపాండిత్య మనఁగా ఇపుడు మనవారు
కొంద ఱనుకొనుచున్నట్లు ఇప్పటి తెనుఁగుగ్రంథములును,
సంస్కృతసాహిత్య లక్షణగ్రంథములును మాత్రము చదు
వుటవలన వచ్చినదే కాదు. దానికితోడు ఇంతకు ముందు
తొలిలక్షణగ్రంథములలో పేరైనను ఎత్తని పైని పేర్కొనిన
తెనుఁగుతోఁబుట్టువులగు భాషలలోకూడ చేసిన కృషివలన
వచ్చినపాండిత్యమును, సంస్కృతమువలెనె తెనుఁగునకు
తోడ్పడిన ప్రాకృతాది భాషలలో చేసిన కృషివలన వచ్చిన
పాండిత్యమును కలియవలయును. ఇంతేకాదు. మనకు సులు
వుగా లభించు ఇంగ్లీషుగ్రంథములు చదువుటవలని పాండిత్య
మును చేర్పనగు. ఇందువలన తెనుఁగున మంచి పాండిత్యము

ంపాదించుకొనుటకు తెనుఁగును, సంస్కృతమును మాత్రము
ేక తెనుఁగుతోఁబుట్టువు లగు తెన్వంగడములోని భాష
లను, తెనుఁగునకు తోడ్పడిన ప్రాకృతము మొదలగు భాష
లను, భూమండలమం దంతటను వ్యాపించి సంపూర్ణ మగు
వాఙ్మయముతో నెలయుచున్న యింగ్లీషుభాషయును చదువ
వలె నని తేలును.

అయిన తెనుఁగుపాండిత్యము సామాన్యముగా అను
కొనునంత సులువుగా లభించునది కాదు. ఇందులకు పలువురు
కూడవలె; పట్టుదలతో పనిచేయవలె; వలయు గ్రంథములు
సంపాదింపవలె, దేశాటనము చేయవలె; డబ్బు చేకూర్చు
కొనవలె. ఇన్ని అమరుట అరిదియే. కాని పని జరుగవలె
నన్న ప్రయత్నమును జరుగవలె. ఇప్పటికి కొంత జరిగినది;
జరుగుచున్నది. తెనుగువాఙ్మయమున కున్నలోపము తీర్చు
తలంపుతోడనే అంగబలముతోడను, అర్థబలముతోడను
'ఆంధ్రసాహిత్యపరిషత్తు' ఏర్పడినది. కొంతపని చేసినది.
అంతవఱకు సంతసింపవలసినదే. కాని అది చేయఁబూను
కొనిన మొదటిపెద్దపని—సూర్యరాయాంధ్రనిఘంటు ప్రచుర
ణము—లభించిన సాధనసామగ్రితో ఏర్పడిన రూపమున నైన
నేఁటికిని నెఱవేఱినది కాదు. కారణము సరిగా తెలి
యదు. అర్థబలములేమి కారాదు. ఇఁక ఇపుడు
అంగబలము చాలమియో! పట్టుదల లేమియో! మఱేమో!

మహారాజుల పోషణమున ఏర్పడిన సంస్థ పనియే
ఇటు లుండ, తక్కిన భాషాసంస్థలపనిఁగూర్చి తడవనేల ?
ఇప్పుడైనను ఆంధ్రసాహిత్యపరిషత్తువారు తెనుఁగున కున్న
కొఱంత తీర్పఁబూని, వ్రాయించి, పెద్దపఱిచిన తమ నిఘం
టువు త్వరలో ప్రచురించి, వారు తెలిపినటుల తెనుఁగు
నుడులకు ఉత్పత్తివ్యుత్పత్తులు తెలుపఁబూనుకొనువారలకును,
మాతృభాషాభిమానులగు తక్కిన తెనుఁగువారలకును
తోడ్పడు పుణ్యము కట్టుకొందురుగాక ! ఏమైననేమి,
ఇప్పటికి తెనుఁగువాఙ్మయపులోటు తీర్చుటకు చేయ ము'
లిడిన యత్నము సరి అయినదారిని, సంతరింపఁదగు వడితో
సాగుచున్నదని తెలుప వీలులేని ఉనికిలోనే ఉన్నది. ఈ
దురవస్థ తప్పింపవలసిన బాధ్యత నిజమునకు ఇపుడు 'ఆంధ్ర
విశ్వవిద్యాపరిషత్తు' వహింపవలె. పైని తెలిపిన తెనుఁగు
పాండిత్యము లభించుటకు వలయు సాధనసామగ్రియు, సదు
పాయములును, ధనసాహాయ్యమును సమకూర్చి, భాషాభి
మానులకు తోడ్పడవలె. తానిచ్చు బిరుదములు కోరువా
రలకుకూడ లభింపనీయక అడ్డువచ్చి నిరుత్సాహము కలిగించు
నియమములను సడలింపవలె. తగినవారలను తానే అరసి
వారికి గౌరవబిరుదము లొసంగవలె. పెఱనాడులలో,
తెనుఁగుపొత్తములను చేకూర్చుకొనుటకు గట్టిప్రయత్నము

చేయవలె. ఇది అది అననేల? తెనుఁగుభాషను లోటులేని స్థితికి తెచ్చుటకు వలయు ప్రయత్నము లెల్ల కావింపవలె.

కావున ఇపుడు పెట్టిన గౌరవపరీక్షకు చదువు చదువు వలన తెనుఁగున పరిపూర్ణపాండిత్యము కలుగఁజాల దని గుర్తించి, ఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తులోని సభ్యులును, పండితులును, భాషాభిమానులును, ధనికులును, సంస్థానాధీశ్వరులును, అందఱకంటె మిన్నగ దాని ఉపాధ్యక్షులును సర్వవిధముల ప్రయత్నింతురు గాక! పలుకుల తియ్యఁదనమునుబట్టి ఇంతకు ముందే 'తూర్పిటాలియను' అనుపేరొందిన మన తెనుఁగు చిన్నిపూఁబోఁడ పైని నుడివిన తెలుఁగున చదువు నెఱవాదులు వ్రాయు మేలికిబ్బంపు విరులతావులు కడలెల్ల వెల్లివిరియ పెఱనాటి మేటిచదువరుల మదితుమ్మెదలకు కొలఁది హాద ననసే పేరామెతలు సమకూర్పనోపునటుల పెంపొందఁ జేయుదురుగాక! తెనుఁగుతల్లిని మేలివాఙ్మయము లున్న పలుకులవెలందు లెక్కినగద్దియలతోఁ సాటివచ్చు గద్దె మీఁద నిలిపి వాసి కెక్కుదురుగాక!

గీ. కని, పలువెతలపా లయి, మనుచుతల్లి-
తల్లికంటె హెచ్చుగ పెంచుతల్లి నాఁడు-
తనమది వెలార్చి పేర్తెచ్చు తల్లిభాష-
తనర, కొలుచువారలకంటె ధన్యు లెవరు?

## చూచిన గ్రంథములు

[ఎన్‌సైక్లోపెడియా బ్రిటానికా, కాల్డువెల్ పండితుని ద్రావిడభాషల పోలిక వ్యాకరణము, గ్రియర్సన్ పండితుని ఇండియాభాషలసర్వే, సీక్రెట్ డాక్ట్రిన్, ఆంధ్రాక్షర తత్త్వము, లక్ష్మజీ - పెత్తీరో - స్ప్రుల్‌జే పండితుల కోందువ్యాకరణములు, ద్రావిడభాషలు, కన్నడిగలు - తెలుగులు ఆంధ్ర వాఙ్మయచరిత్రము, ఆంధ్రులచరిత్రము, బ్రిగెల్ పండితుని [illegible] వ్యాకరణము, సునీతికుమారచట్టర్జీ పండితుని బంగాలీపుట్టుపెంపులు, బి[illegible] చంద్రమజుందారు పండితుని బంగాలీచరిత్ర, తెనుగు మహాభారత[illegible] మొదలగునవి.]



సుఖము. నీవు కీర్తిని సంపాదించుకొనుటయే మాకుకీర్తి. అన్ని విధముల నీవే నాకాధారము అని, దీవించిపంపెను.

కైకభరతునకు రాజ్యమిమ్మని దశరథుని కోరెను. రాముని అడవికిఁ బంపుమనెను. దశరథుఁడు అట్లుసేయక తప్పినదికాదు. కొంతసేపటికి శ్రీరాముఁడు సీత లక్ష్మణుఁడు అడవులకుఁ బోవుచున్నారని కౌసల్యకుఁ దెలిసినది. ఆమె చాలదుఃఖమునొందెను. వసిష్ఠుఁడువచ్చి రామునిఅవతారమును గూర్చి కౌసల్యకు బోధించెను. ఆమె దుఃఖము కొంత శాంతించినది. ఆమె శ్రీరామునిఁ బిలిచెను. అతనిచేతికి రక్ష గట్టిపంపెను. శ్రీరాముఁడు అడవికిఁబోయెను.

దశరథుఁడు రాముని విడిచిన దుఃఖముచే మరణించెను. కౌసల్య అతనితో సహగమనము చేసెను.

---

## 8. లోపాముద్ర.

లోపాముద్ర విదర్భరాజు కూతురు. ఆమె చాల చక్కనిది. అన్నివిద్యలలోను గొప్ప పండితురాలు. మిగుల బుద్ధిమంతురాలు. పురాణములన్నియును జదివినది. దేశచరిత్రములన్నియుఁ దెలిసికొనినది. యౌవనవతియై యుండెను. ఆమె నిచ్చి పెండ్లిచేయుటకుఁ దగిన వరుఁడు దొరుకలేదు. తండ్రి మంత్రులను పురోహితులను దేశదేశములు ద్రిప్పుచుండెను.